ప్రతి రచన భావస్ఫూర్జితమై, తెలుగు నుడికారములోని ప్రౌఢిమతో, మంజులగాన మాధుర్యముతో తెలుగు పాఠకులను ఉత్తేజితులను జేసినది. వారి ఆలోచనాశక్తికి దీప్తిని కలిగించి, మనస్సులోని ఉత్తమ భావాలను జాగృతం చేసింది. మానవ స్వభావోన్మీలనంలోనూ, కర్తవ్య ప్రబోధంలోనూ, ఆయన సృష్టించిన వివిధ పాత్రలు, ఏర్పరచుకున్న సంఘటనలు, వాస్తవికతకు ప్రతిబింబములు. ఉపజ్ఞామహితమైన ఆయన రచనలు అనేక మనోవైజ్ఞానిక సత్యములను వెల్లడించినవి.

ఈ పుస్తకంలో సంకలనంచేసిన శీర్షికలలో. వీణ, బూరెముక్కలు కథానికలు.పొరపొచ్చములులేని అనుకూల దాంపత్య జీవితంలో 'వీణ'లో తారస్థాయి మెట్టునుంచి అహంకార పూరిత స్వరంతో పై అధికారులు 'కృష్ణారావు' పురుషాకారాన్ని అవమానించారు. 'అతని హృదయంలో గంధక ద్రుతి వొలికినట్లైంది.' అతని భార్య కళ్యాణి, అందాలరాణి-మధురగాయని. ఆమె వీణావాదనంలో ప్రజ్ఞావతి. ''రాచ వుసిరి చివుళ్ళలాంటి ఆమె మునివ్రేళ్లు వీణ మెట్లను చకచక చక్కలిగింతలు పెట్టి కిలకిలలాడించివేస్తున్నాయి.'' కళ్యాణికి గానం ప్రాణప్రదమైంది. అసూయాగ్రస్తమైన మానవాకారములు, ఆమె తాంబూరతో కృష్ణారావు మానవత్వాన్ని చితకకొట్టినవి. ఆమె పాడకూడదని భర్తకు గల అధికారంతో కృష్ణారావు, కళ్యాణిని శాసించాడు. ఆమె శిరసావహించింది. విరహిణి అయి ఆమె ఆక్రోశించింది. రసవత్తర పరిణామంలో భార్యా భర్తలిద్దరూ సమాశ్వాసం పొందారు.

'బూరెముక్కలు' పెంపకపు మమకారాన్ని మహోన్నత శృంగాగ్రములకు తీసుకొని వెడుతున్నది.

'సాహిత్య సమవాకారం' కాల్పనిక నాటిక.సమకాలీనులైన కవుల ధోరణులు వ్యంగ్యంగా చిత్రించడంలోను, నిశిత విమర్శలలోను నాటకకర్త ప్రతిభ భాసిస్తున్నది.

ఇవిగాకుండా అయన రచించిన గేయములలో మహోదయం, మాతృగీతి, కీలుగుఱ్ఱం, క్విట్ ఇండియా, స్వర్గానికి రోడ్డు, నీ కవి, ప్రపంచ విప్లవము, మురళి యిందులో ఉటంకించబడినవి. ఆయన రచనలలోని విశిష్టగుణాలను యీ భావగుచ్ఛంలో గుదికూర్చి చిరయశస్వి అయిన యీ ప్రజ్ఞాశాలి ఆత్మశాంతికి అంజలి ఘటించటమే, 'మహోదయం' ఆశయం.

ఆర్ద్ర హృదయులు, ప్రియం భావుకులు, కవితా కళా బాంధవులు అయిన శ్రీ జె. వి. సోమయాజులు, యశఃకాయుడైన తెన్నేటిసూరి చేసిన సారస్వత సేవకు ముగ్ధులై, యీ గ్రంథ ముద్రణమునకు వలసిన ద్రవ్యమునంతటిని సహాయము చేసినందుకు సారస్వతార్చకులందరు కృతజ్ఞులు కాగలరు.

తెన్నేటి సూరి రచనలు ఆప్యాయతతో చదివిన తెలుగు పాఠకులందరు యీ పుస్తకమును నిండు హృదయాలతో సమాదరించి స్వీకరిస్తారని ఆశిస్తున్నాను.

మద్రాసు
1-5-59

తుమ్మలపల్లి సీతారామారావు.

# వీణ

## ౧

"రాగసుధారసా...

......స్వరరాగసుధా..."

ఆ మధురరాగం...ఆ వీణ మెట్లమీద...పై స్థాయిల నుంచి క్రింది స్థాయిలకు, బరువు లెత్తుతున్న మాధుర్యాలతో.... ఆగి ఆగి...నెమ్మది నెమ్మదిగా...దిగుతోంది_లేడి చూలాలు కొండలవాగు జాలువెంట దిగే అలస సౌందర్యంతో—

రాచవుసిరి చివుళ్ళలాంటి ఆ మునివ్రేళ్ళు, ఆ వీణ మెట్లను చకచకా చక్కిలిగింతలుబెట్టి కిల కిల లాడించి వేస్తున్నయ్—

ఆ ముంజేతుల బంగారు గాజుల పసిబిడ్డ కులుకు నవ్వుల పలకరింపులకు పులకరించుకొన్న బిడ్డ తల్లి ముద్దుల లలిత నినాదాల లాగు ఎడతెగని వరుసగా తాళగతులలో వినిపిస్తున్నై స్వర్గసుఖానికి సోపానాలై.

కల్యాణి ఒడిలో ఆ వీణ యిటూ అటూ – కొంచెం కొంచెం...ఊగిసలాడుతూ, పసిబిడ్డలా ముద్దులు గుడుస్తోంది.

కల్యాణి పంచపాళీలో కూర్చుని, "రాగసుధారసా" అనే మధుర గీతి వాయించుతోంది.

ఆ మధురస్వనాలు గాలి తీగెలతో కలిసి ఆ పంచవాటీ ముందు వున్న పూలమొక్కలలోకి వ్యాపిస్తున్నై. ఆ పూల మొక్కలు - గుత్తులు గుత్తులుగా విచ్చుకొన్న పూలు కొప్పు కొనలలో చెరువుకుని, బారులుతీరి, నిశ్శబ్దంగా కూర్చుని వింటున్నయ్. చిరుగాలికో, లేక యీ గానం విని ఆనందించో, కొంచెం కొంచెంగా తలలు పంకిస్తున్నాయి. కాని - చప్పట్లు గొట్టి, ఈలలువేసి, "భేష్! భేష్!" అంటూ కొంప లంటు కున్నట్టుగా బొబ్బలు పెడుతూ గందరగోళంగా అభినందించటం లేదు.

గంధర్వ స్త్రీలు యీ మధుర గానం వినాలని ప్రియుల తీపి కౌగలింతలలోనుంచి, అప్పటి కప్పుడు, కికురించి తప్పించుకు వచ్చి కూర్చున్నట్టుగా వున్నయ్ ఆ పూలమొక్కలు - లేక పోతే ఇతర సమయాల్లో అంతంత కైసేతలు దేనికి?

గగనపథం వెంటపోతున్న చంద్రుడు యీ గానం చెవులబడి కాలు కదవలేక నిలబడిపోయినట్టున్నాడు. వెండి వెన్నెలలు ఒలికొలికి పోతున్నయ్, ఆ తోటంతా—

సర్వసంగ పరిత్యాగిగా ఆయన్ను ప్రజలు ఎంత మెచ్చు కొంటున్నా గౌతమ దేవుడు, ఈ గానకళా నిరతిలో మునిగి తన్మయుడు కాకుండా వుండలేకపోయాడు. అది వారి శక్తికి కూడా మించినపనిగా పరిణమించింది. ఆ పూలమొక్కల మధ్య ఒక తెల్ల రాతిపలక పరిచివున్న వేదికమీద కూర్చుని, శరీరమంతా చెవులుచేసుకొని వింటున్నాడు. అరమోడ్చిన ఆ

కనురెప్పలపైనా, ప్రపంచ శాంతిప్రదాలైన ఆ పెదవుల మీదా, ఈ గానంవల్ల కలిగిన మహదానందం, జిలిబిలిగా, చిందులాడుతోంది. ఈ గానం వింటూ, అలా పదే పదే అచలంగా ఉండిపోవడంవల్ల కాబోలు ఆయన దేహం ఒక పాలరాతి ప్రతిమగా మారిపోయింది.

వెండి వెన్నెలలు ఒలికిపోతున్నయి—

గౌతమదేవులు కూర్చునివున్న ఆ స్ఫటికపు పలక ఒక చిన్న జలాశయంలా కనిపించుతోంది...ఆ మధురగానానికి. ఆ స్ఫటికం, ఒడలు జలదరించుకొని, నిలువునా నీరై వూరుతుంది.

"రాగసుధారసా...."

కళ్యాణి హృదయం ఉద్రిక్తమౌతోంది. ఆమె సృష్టించుకుంటున్న ఆ మధుర నినదాలు ఆమెనే వివశపరుస్తున్నయ్-ప్రసవితమైన పచ్చి బాలింత, తన కడుపుపంటను పొత్తిళ్లలో చూచుకుని, గర్వంతో, పరవశత్వాన్ని పొందినట్టు-కళ్యాణి ఉద్రిక్తమౌతోంది. ఆ ఉద్వేగంలో, ఆమె హృదయం ఆ వీణ మెట్లమీద అనంతంగా మాధురీ సౌందర్యాలను ఒలికొలికి పోతోంది, మునివేళ్ళ గమనాలతో, స్వర్గ సోపానాలుగా, మారుతున్నయ్ ఆ వీణమెట్లు—

ఆందోళిరాగం, ఆ వీణ మెట్లమీద ఒక లతకూనగా ప్రభవించింది...మోసులెత్తి చివురులు దొడిగి, క్షణక్షణం చకచకా, విస్తృతమై, విచ్చులుకొని...ఆలంబనాలతో అవసరం లేకుండానే...తీగెలు తీగెలుగా...అనలనలుగా...

జాగి_జాగి...సాగిసాగి...తూగి తూగి....పరుగులు పెడుతూ...ఆ పంచపాళీని,ఆ పూలతోటను, ఆ పరిసరాలను,యీ రోదసినంత వ్యాపించిపోతోంది_అత్యద్భుత దివ్యసౌందర్యాలను గుబులొత్తని గుత్తులు గుత్తులుగా పుష్పించిపోతూ_ ఆ కుసుమ గుళుచ్ఛాల సౌరభ్య సౌందర్యాలతో, రోదసి గుబాళించి విస్తుపోతోంది.

ఇలాంటి కుసుమవిసరాలు దేవలోకంలో కూడా వున్నా యన్నట్టు మన మెప్పుడూ విన్నమాట గాదు. 'వాడని పరువం చెడని' రూపసౌరభాలు గల పారిజాతంలాంటి పువ్వులేవో కొన్ని వున్నాయంటూ వచ్చారు గాని, ఇలా వీటికి మల్లే... కర్ణపేశలాలైన మధుర రుతాలను కూడా కలిగివున్న పువ్వుల సంగతి మన మెప్పుడు విన్నాం ?__

ఆ పంచపాళీలో, కళ్యాణికి కొంచెం చేరువలోనే, ఆమె తండ్రి చంద్రశేఖరరావుగారు, ప్రేము కుర్చీలో కనులు మూసుకుని కూర్చొని, యీ విపరీతమైన సౌందర్యాలతను దర్శిస్తున్నారు...ఆ దివ్య కుసుమాల సౌరభాన్ని చెవులతోనే ఆఘ్రాణించుతున్నారు. ఆ కుసుమ విసరాలనుంచి స్రవించి ఆయన శ్రవోగోళాలలో ఒలికిన అమృత బిందువుల జాలులు ఆయన రక్తరుధురలలో ముర్మురించుతూ హృదయానికి వ్యాపించి బరువు లెత్తిపోతున్నయ్...ఆ తీపి బరువులను ఇక తను మోయలే ననుకున్నాడు...

"తల్లి!"...అని పలకరించాడు...నెమ్మదిగా.

"ఆఁ!..." స్వర్గం నుంచిలా జవాబు.

"కొంచెంసేపు...ఆపుతావూ!..."

బిక్కమొగం పెట్టి..."ఇప్పుడు_అపలేను నాన్నా..." అన్నది దీనంగా—

"సరే...వాయించుకో...ఆ వెన్నెలలోకి పోయి దూరంగా కూర్చుని వింటాను—"

పంచపాళీమెట్లు దిగుతున్నాడు...నిశ్శబ్దంగా. ఆయన బట్టతల మీద వెన్నెల తీగెలుపడి 'జిగేల్ జిగేల్' మంటు న్నయ్...ఆయన తొడుక్కున్న - చలువచేసిన పొందూరు ఖద్దరు లాల్చీ, పాముకూసంలా మిల మిల లాడిపోయింది. ఆ వెన్నెల వెలుగులలో_పూల మొక్కల మధ్యగా నడుస్తూ. గౌతమదేవులు అధిష్టించివున్న ఆ వేదికమీదికి చేరుకుని ముంజేతిమీద శిరస్సు నానించి కొంచెంగా జాలిగిలబడి పడు కున్నాడు—

ఆ రాగలతను దర్శించకుండా వుండాలని ఇంతదూరం శ్రమపడి వచ్చింది ఈ రసిక హృదయం—లాభం? తల్లి కొంగుకొన పట్టుకుని వెనకాతలే పాదాలు తొక్కుతూ, పరు గులు తీసుకుంటూ వచ్చిన బసిబిడ్డలా...కిలకిల లాడు కుంటూ...అనలు హస్తాలుగా సాచి...ఆయనను చేరుకుంది ఆ రాగలత...ఉక్కిరి బిక్కిరిగా ఆయన్ను బిగ్గ కౌగలించు కొని, పక పక లాడింది.

ఆ ఆలింగన సుఖావాప్తిలో ఆయన నిమీలిత నేత్రుడై...ప్రాస్పడిన చిత్తరువులా—

# ౨

గ్రాంగ్-గాంగ్-గాంగ్-గాగ్-గాగ్...

దూరాన వున్న, పొగబారిన చింతచెట్టు క్రిందనుంచి వినిపించుతున్నయి-దెబ్బమీద దెబ్బ-విసుగెత్తేలా-నిరతిలేని విశ్వ కార్మికుని సమ్మెటపెట్టు అనంత కాలగర్భంలోకి ప్రతిధ్వనించుతున్నయ్...

"జడ-జడ-జడ-జడ-జడ..."

ఎడతెగని లోహపు గొలుసుగా...ధ్వనించుతోంది... కృష్ణారావు హృదయంలోకి - ఆ టైప్ మిషన్ - మానవునికి జడత్వాన్ని నిరంతరం ఉద్బోధిస్తోంది - ఉక్కు శబ్దాలతో - ఆ టైప్ మెషిన్—

జానెడు ముందుకు జరగటం - మళ్ళా జానెడు వెనక్కు లాగివేయబడటం - స్వేచ్ఛా విహీతనచేత ఎదుగూ బొదుగూ లేకుండాపోయిన మానవ సంస్కృతియొక్క దౌర్భాగ్యస్థితిని ప్రతిపాదించుతోంది - ఆ టైప్ మెషిన్ క్యారియర్—

తనకు బానిసగా వుండాలని యీ పిశాచ యంత్రాన్ని సృష్టించాడు మానవుడు. అది తిరగబడి మానవుణ్ణే బానిసను చేసి పారేసి తనముందు కూలేసుకొని, ఎముకలు కొరుక్కు తింటోంది అహోరాత్రులూ - రక్తసిలా. దానిముందు కూర్చుని పనిచేస్తున్నాడు కృష్ణారావు. అతనికీ అతని మనసత్వానికీ మధ్య పర్వతాలల్లే అడ్డం నుంచున్నయ్ ఆ గది గోడలు.

ఈ బ్యాంకి ఉద్యోగంలో అతనుచేరి ఒక మాసం రోజులు మాత్రమే అయింది. కాని, యీ ముప్ఫైరోజుల బాని సత్వం అతనికి ముప్పయి యుగాల నరకమనిపించింది. జీవితంలో అతనికి అదివరకు అనుభవానికి రాని, భయంకరమైన సత్యాలు అనేకం రుద్రమూర్తులులా ప్రత్యక్షమై, అతణ్ణి కల్లోల పరుస్తు న్నాయ్. సహజంగా ధీశాలి గావటంచేత వాటిని జయించాలని శాయశక్తులా తిప్పలు పడుతున్నాడు. ఆ వ్యర్థ ప్రయత్నం అతనికి ముచ్చెమటలు పట్టిస్తోంది.

తన జీవితంలోకి సుఖ సౌందర్యాలను తెచ్చుకోవాలని అతని ఆశ. తన రక్త మాంసాలను, మానవత్వాన్ని హరించి, ఒరులు సుఖ సౌఖ్యాలను అనుభవించడానికే యీ నిర్మాణ మంతా పన్నబడివుందని అతనికి తెలియకపోవడమే అతని అజ్ఞానం.

అతను బీ-కామ్, ప్యాసైనాడు - షార్టుహ్యాండూ టైపు రైటింగు కూడా తరువాత పూర్తిజేశాడు. గుమస్తా గిరి ఖాళీ లేకపోవటంచేత టైపిస్టు ఉద్యోగం ఇచ్చారు. మొదట్లో చిన్న ఉద్యోగమే అయినా తను పెద్ద పరీక్ష ప్యాసై ఉన్నాడు గనుక క్రమేణా పైకిపోవచ్చు ననుకున్నాడు - ధర్మాన్ని మోచేత్తో వెనక్కునెట్టి, అధర్మాన్ని ముందుకు తోసుకుపోతున్న ఈ రోజుల్లో ఇది పిచ్చి వూహేననాలి. అసలు తనకు ఈ పెద్ద డిగ్రీ ఉండటం చేతనే పెద్ద పెద్ద ప్రమాదాలు బండలుగా బండలుగా; కొండల మీదనుంచి, దొర్లి అతని తలమీద పడు తున్నయ్. ఆ బ్యాంకులో ప్రతి కన్నూ అతన్నిచూసి అనవస

రంగా జేవురించుతోంది - ఈ పాడు డిగ్రీ మూలంగా ప్రతి వన్నూ పదుప విషాలనే క్రక్కుతోంది.

"బీ-కామ్" ఈ రెండు అక్షరాలూ స్ఫురించగానే ఆ బ్యాంకులో పనిచేస్తున్న వాళ్ళందరికీ చిరాకెత్తుకొస్తుంది - వాళ్ళంతా పాత ప్రైమరరీ సర్టిఫికెట్లు పుచ్చుకొని, తక్షు లాక్రమించి కూర్చుంటే, ఇవ్వాళ తనొక బీకామ్‌ను అంటూ బయలుదేరితే యెలా యేడుస్తుంది ?

అసలు యితనికి ఉద్యోగం యివ్వటానికే వల్లగాదని సెక్రటరీ, డైరెక్టర్ల మీటింగులో దెబ్బలాడాడు. కృష్ణారావుకు పాపం డిగ్రీ అయితే మాత్రం పెద్దదేవుంది కాని, దస్తూరి మాత్రం కుక్కలు-నక్కలు దేకినట్టుంటుంది అన్నాడు. టైపిస్టు ఉద్యోగానికి దస్తూరితో నిమిత్తమేమిటని యీ సలహా త్రోసి వేసి, కృష్ణారావుకు ఉద్యోగం యిచ్చారు డైరెక్టర్లు.

సెక్రటరీకి తలవంపులైంది ఈ ఘటన. తమపై అధి కారిని అలా డైరెక్టర్లు నిర్లక్ష్యం చెయ్యటం అతని అనుచర వర్గానికి అలానే అనుపించింది. కృష్ణారావును బ్యాంకిలోనుంచి తరిమి వేయలేకపోతే తన తెలివెందుకు తగులెట్టనా అను కున్నాడు యెకౌంటెంటు. డవాలీ బంట్రోతు దగ్గరనుంచి దస్తుపరాఫ్ దేఖీలూ యుద్ధసన్నద్ధు లయ్యారు. కృష్ణారావును బ్యాంకిలోనుంచి తరిమి తీరాలి. దీనికి కావలసిన యోగంధ రాయణ మంతా నడుస్తూంది, రెండుమార్గాలు...కృష్ణరావు అసమర్థుడని నిరూపించి సాగనంపించటం మొదటి పంథా :

కసుక్కు కసుక్కున, ములుకులుగా గుచ్చుకుని, పైకి రక్తాలు చిమ్మకపోయినా, హృదయాన్నంతా పచ్చి పుండు చేసివేసే, విషాక్తాలయిన, సూటీ పోటీ కుళ్ళు మాటలు విసిరి, తనంతట తను అతనే బయటికి వెళ్ళిపోయే పరిస్థితి కల్పించటం రెండవ పద్ధతి.

*　　　*　　　*

'ట్రయ్ య్ య్ య్ య్!...ట్రయ్ య్ య్ య్ య్!...' మంటూ కంచుగొంతు బ్రద్దలు గొట్టుకుంటోంది ఆ టేబుల్ బెల్..."లేచి రావేం?"...అని మళ్ళా మళ్ళా గొంతు చించుకొని బొబ్బలు పెడుతోంది_అధికార కంఠంతో_ కృష్ణరావు కదలబోయాడు_"ప్రాణంలేని ఆ కంచు ముక్కకు నీవు బానిసవై కంగారుపడి కాళ్లు తొక్కుకుంటా వేమిటి.... వెళ్ళకు! కూర్చో!" అన్నది అతని హృదయం.

కూర్చున్నాడు—

"నీకేమన్నా పిచ్చెత్తిందా? వెళ్ళకపోతే నీ ఉద్యోగం వూడుతుంది, నీ పై అధికారి పిలుస్తున్నాడు_పో. వెళ్లు" అన్నది మనస్సు—

హృదయం:—ఎక్కడెంటు పిలిస్తే మాత్రం నువ్వెందుకు వెళ్లాలి? అతనికి నీ వెందుకు బానిసవై పడివుండాలి? అతను నీ కంటే యేమన్నా పెద్ద చదువు చదువు కున్నాడనా?...నీ కంటే పెద్ద తెలివి తేట లున్నాయనా?

మనస్సు :—లాభంలేదు_చెడతావు_నీ హృదయాని కిక్కడ తావులేదు.

"ట్రయ్య్య్య్య్" మంటూ మళ్ళా గొంతు చించుకుంటోంది——

ఎక్కౌంటెంటు గదిలోకి కృష్ణారావు పాదాలు నెమ్మదిగా నడిచినై...

ఎకౌం:——ఏమయ్యా! - యేం - చెముడా?

కృష్ణారావు:——మెషీన్‌లో కాయితం తీసి అవతలబెట్టి వస్తున్నాను సర్!

ఎక్కౌం:——హూఁ-(ఒక ఎలుగొడ్డు మూలుగు-ఒక కాయితం ముక్క తీసి బల్లమీద విసరికొట్టి) దీనికి, కాపీయేది తగులెట్టి?

కృష్ణా:——కాపీ కావాలని అనుకోలేదండీ...

ఎక్కౌం:——బి. కామ్ ప్యాసయ్యాననే టెక్కు తప్ప, పనిపాట లేమయినా తెలిసేడిస్తేనా?

కృష్ణా:——కొత్తవాణ్ణవటంచేత తెలియలేదు. క్షమించండి. కాపీ కావాలని యెవ్వరూ నాకు చెప్పారు కారు.

ఎక్కౌం:——స్టుపిడిటీ...

'చిత్తం' అనలేదు కృష్ణారావు...అతని హృదయం మెదడులోకి వెచ్చని రక్తాన్ని చిమ్ముతోంది క్రిందినుంచి!

ప్రక్కనున్న వరండాలో సిగరెట్టు దమ్ము కొడుతున్న సెక్రటరీ కులుక్కుంటూ లోపలికివచ్చి-"మనవాణ్ణి యివ్వాళ మందలించకండి. మాంచి హుషారుగా వున్నాడు ఇవ్వాళ" అన్నాడు-కృష్ణారావు భుజంమీద చెయ్యివేసి తట్టుతూ.

ఎకౌంటెం :—ఏమండీ కథా ?—

సెక్రెటరీ :—మీకు తెలియదా యేమిటి? మనవాడి భార్య ఇవ్వాళ సాయంత్రం ఆరుగంటలకు రేడియోలో పాడు తుంది.

ఎకౌంటెం :—ఏమిటి_ఆవిడ రేడియోలో పాడేటంత బాగా పాడుతుందా యేమిటి ?_నాకు తెలియదండీ.

సెక్రెటరీ :—ఆవిడ పెద్ద పెద్ద కచేరీలు కూడా చేస్తుం దండీ. చాలా బ్రహ్మాండంగా పాడుతుందీ...అసలు మీకు తెలియకపోవటమేమిటండీ...వసంతకోకిల శ్రీమతి కళ్యాణి... అంటారు ఆవిణ్ణు...చాలా పెద్ద గాయకురాలు లెండి! సునా యాసంగా నెలకు అయిదారు వందలు సంపాదించి అవతల పారవేయగలదు.

ఎకౌంటెం :—అరె! కళ్యాణి నీ భార్యాటయ్యా! చెప్పావుకావేం ఇంకేం...అదృష్ట వంతుడివి.

కృష్ణ :—నా యీ బ్యాంకి బానిసత్వంలో ఆవిడ ప్రసక్తి తేవటం అనవసరం. మీరా ధోరణి మానాలని కోరు తున్నాను.

ఎకౌంటెం :— (తలతిక్కగా) బ్యాంకి వ్యవహారమే నయ్యా! నేను మాట్లాడుతున్నదీనూ!...ఇట్టా చేతావాతా గాని పనులుచేసి మా ప్రాణాలు కొరక్కపోతే...శ్రుతి తంబురా పుచ్చుకుని ఆవిడ వెనక కొంగట్టుకు తిరుగుతే యీ మాత్రం కాలక్షేపం నీకు జరక్కపోయిందా ? అని!

"పటప్ !"—

ఎక్కాంటెంటు గూబ కదిలిపోయింది, ఆ గూబ కాయతో—

3

"నా చిట్టితల్లికి ముఖ్ మల్ గౌను కుట్టించుకురా నాన్నా! ఆ సిల్కుది బాగుల్లేదు, గరుగ్గా వుంది" అన్నది కళ్యాణి.

"చిట్టితల్లి పుట్టనీ – కుట్టించుకురానూ...అయినా నీ కూతుర్ని మర్యారీ పద్ధతిని గౌను వేసి పెంచుతావా యేమిటి?"

పగలబడి నవ్వుతూ–"సరే సరే, నేనిప్పుడు నీకు మనమరాల్నెక్కడకనేది ?...(నవ్వుతూ) బలే బలే! ఈ మాట బాగానే వుంది...నేనొక చిట్టిపాపాయిని కనటం... అదేమో...'క్యాఁ క్యాఁ క్యాఁ' అంటూ రాగాలెట్టడం... నువ్వు దాన్ని బుజానవేసుకొని 'ఇచ్చిచ్చిచ్' అంటూ సముదాయించటం...ఇదంతా బాగానే వుంది"–చక్న కంఠం మార్చి కొంచెం కోపాన్ని అభినయిస్తూ, "ఏమిటి నాన్నా! మరీనూ, ఇల్లాంటి మాటలు"–మూతి ముడుస్తుంది–వాలుజడ చివర బట్టుకొని చివాల్న భుజంమీదుగా ముందుకు ఎగరవేసి క్రిందికి జారలాగుతూ—

"నువ్వన్నమాటేగాని?"

"అయ్య బాబోయ్! నేనిప్పుడు పిల్లల్ని కంటా నన్నానా?"

"చిట్టిపాపకు గౌసైన కావాలనలేదూ ?—"

"అయ్యో వెఱ్ఱిబాగులతండ్రీ! చిట్టితల్లంటే నీకు అర్థం కాలేదన్న మాట..."

చకచకాపోయి తివాసిమీద పెట్టివున్న వీణను ఆప్యాయంగా కావలించుకుని ఒక చిన్న ముద్దు పెడుతుంది దానికి.

"వీణ సంగతా ?...మనమరాల్ని కంటూవేమో... కాస్త బుగ్గ గిల్లి యేడుపించుదామని గంపెడాశ బడ్డాను, వట్టిదేనా ?"

"ఎప్పుడు కుట్టించుకు వస్తావూ ?"

"ఇదుగో...వెడుతున్నాను."

"మరే! నాన్నోయ్! ఇక్కడ దంతపు నగిషీ కాస్త వూడిపోయింది నాన్నా !"

"సరే, బండి తీసుకువచ్చి బజారుకు తీసుకువెళ్ళి బాగు చేయించుకు వస్తాను."

"ఎందుకూ ? ...పనివాణ్ణే ఇక్కడకువచ్చి బాగు చెయ్యమనరాదూ ?"

"అతను చాలా పెద్దపనివాడు. ఈ కాస్త భాగ్యానికి ఇంటికి రమ్మంటం యేమంత బాగుంటుంది ?"

"పోనీ అక్కర్లేదు లెండి. అలాగే సరిపెట్టుకుంటాను."

"అదేమిటీ ?"

"నా చిట్టితల్లి నా దగ్గర లేకపోతే నాకు తోచదు బాబూ !"

"ఎంత సేపమ్మా. అరగంట భాగ్యం."

"అహాహా! అరగంట కాదు కదా, అరనిమిషమైనా నా వల్లగాదు బాబూ! నాకు అదేమిటో చికాకుగా వుంటుంది. నా కసలక్కఱలేదు."

"సరే, పోనీలే అతన్నే తీసుకువస్తాను."

౪

రాణా ప్రతాప్ కోరమీసం చిమ్మెట కొరికింది. మొఖాన గంటు పెట్టుకుని చికాకుగా కూర్చున్నాడాయన. ఇది కృష్ణరావు గమనించనే లేదు. ఆ పటంమీద ఈ ప్రక్కనుంచి ఆ ప్రక్కకు "కళ్యాణి తంబురా" అన్న అక్షరాలు జ్వాలా తోరణంలా భగభగా మండిపోతున్నట్టు కన్పించుతున్నయ్ అతనికి, రక్తారుణ జ్వాలలుగా—

అతని పురుషకారాన్నే అవమానించటం ఆవాక్యం. బ్యాంకిలోనుంచి పొమ్మనవచ్చు. కళ్యాణివెంట తంబురా పుచ్చుకు తిరగమని కూయటానికి, వాడికేమిటి అధికారం?... అతనికి గుండెల్లో గంధకధృతి ఒలికినట్లయింది.

ఆ మాటల్లో యేమంత తప్పుందనీ?...తన భార్య సరస్వతిలా కూర్చుని, వీణ వాయించుతూ ప్రజా గౌరవాన్ని చూరగొంటుంటే...తను తంబురా శ్రుతి మీటుతూ వెనక కూర్చుని ఆమె గౌరవంలో భాగం పంచుకోటం...అది... అవమానకరమేనా?...అల్లాంటి మహాభాగ్యం తమ జీవితాలకు లేకపోయిందని ఎన్ని యువకహృదయాలు కించపడటం లేదు! వాళ్ళంతా లేకి మనుష్యులనేనా ఇతని అభిప్రాయం?

అది అవమానశల్యం గాకపోతే, ఎక్కాంటెంటు ఆ వాక్యాన్ని అలా శూలంలా తన హృదయంలో కస్సున దిగ వేసి అంత బాధ ఎలా కలిగించాడు?...

ఎక్కాంటెంటు మాటలు అర్థంలేని పిచ్చిమాటలేమో?

అర్థం లేకపోవడ మేమిటి?...అర్థం లేకపోతే తన్నా మాటలు ఎందుకంత కలవర పరుస్తాయి. తను మాత్ర మెందుకంత తొందరపడవలసి వస్తుంది?

పాపం...ఎక్కాంటెంటుమీద, తను కుర్రతనంగా చెయ్యి చేసుకొని, అనవసరంగా ఆయన్ను అవమానించా డేమో?

చట్? తొందరపడట మేమిటి? — కళ్యాణి వెనక తంబురా మోస్తూ బ్రతకమని తన్ను వాడు ఎంత పలగాకి తనంగా కూశాడు?...కాలసర్పంలా మునిపంట కాటు వేశాడు...కాటులో విషం లేదని హృదయానికి నచ్చచెప్పుకుని శాంతంగా బ్రతకాలనిచూస్తే మాత్రం ప్రయోజన మేమిటి?... ఒక చెంప ఆ విషానల జ్వాలలు ఆపాదమస్తకం ఎగబాకి మంటలు బుట్టించి, తన్ని భస్మీకరించి వేస్తుంటే? – తన రక్త నాళాల్లో హాలాహలం భుగభుగలుగా పొంగులు రేగుతుంటే?

మనస్సు కొంచెం శాంతిపరుచుకోటం యెందుకైనా మంచిదేమో!

శాంతి! శాంతి! – అర్థంలేని పిచ్చిమాటలు...వాణ్ణి యింతింతింత ముక్కలుగా చిత్రవధ చేసివేస్తేమటుకు తన హృదయానికి శాంతి గలుగుతుందా?—

కుపిత మానవహృదయం. ఆకాశాన్ని అంటి పెరిగిన ప్రమాదకరమైన అగ్నిపర్వతం – శిఖరాన శిఖరేఖ జేవురించనే రాదు… జేవురించితే?

అవును – జేవురించగూడదు…అసలు అగ్నికుండాలుగా ఈ మాటలు ఇలా ఎందుకు తయారైనై? ఎక్కడిదీ కీల?

"కళ్యాణి వెనక తంబురా" – తనకేం ఖర్మం…తను చిన్నప్పటినుంచీ ఎంత కష్టపడి చదువుకున్నాడు! ఎంత ప్రతిభ సంపాదించాడు! ఇదంతా వ్యర్థమేనా?…పోనీ, వ్యర్థమైతే మాత్రం తనకేంలోటు?… రెక్కల కష్టంచేసి బ్రతకవలసిన అవసరం కూడా తనకు లేదే!… కాస్తో కూస్తో తండ్రి తనకు ఆస్తి యిచ్చే వెళ్ళాడు. తన జరుగుబాటు కేం లోటు?… ఏమిటా వెధవ కూసిన పిచ్చికూతలకు అర్థం మరి?

'కళ్యాణి' – కళ్యాణి మాటెత్తాడేమిటి? 'కళ్యాణి'… యీ అక్షరాల్ని జ్వాలా రేఖలుగా గుప్పున తన హృదయం లోకి వూది ఒక్కసారి అలా ఎలా దహించివేశాడు! ఈ అక్షరాల్లోనుంచి ఇంత అగ్ని ఎలా పుట్టించాడు!!…

కళ్యాణి తన భార్య…తన్ను ఎంతో ప్రేమించుతుంది. తన్ను ఎంతో గౌరవించుతుంది: కళ్యాణి హృదయం తన లీలా వసదం…వెలుగుల మేడ. అతను బాహ్య ప్రపంచాన్నంతా విస్మరించి … సుఖంగా కన్నుమూసే హంసతూలికల పట్టు పరుపులూ, సుఖతల్పం, ఆ వెలుగుల మేడలో వెన్నెల తెరల చాటునేగా వున్నయ్ – ఇది తనకు అవమానకరంగా ఎత్తి చూపదగిన విషయం కాదే?….అసలు తనూ, కల్యాణీ హృద

యాలు పెనవేసుకొని మీనమిథునంలా యీదులాడుతున్న ఆ మధురవాహిని లోతులు అర్థం చేసుకోగలగటానికి, వాడికేం తాహతు వుంది?....

మరి....'తంబురా' — ఛీ! ఛీ! కళ్యాణి తన్ని తంబురా యెందుకు మొయ్యమంటుంది?

ఒకవేళ మొయ్యమంటే?

మొయ్యమంటే మొయ్యనంటాడూ?....యేముం దిందులో...ఏమీటా లేకి వెధవ కుంటికూతలకు అర్థం మరి?...

మోస్తేగాని వీల్లేదని పట్టుబడుతుందేమో?

ఎలా పట్టుపడుతుంది?....కళ్యాణి తన భార్య. తన్నలా శాసించటానికి, కళ్యాణికి తనమీద యేమిటి అధికారం?.... కళ్యాణి తన భార్య....తన కన్ను సన్నల్లో మెలుగుతూ, తన అధికారంలో పడివుండవలసినది....కళ్యాణి పెంకెతనం తన ముందేం, సాగుతుంది?

అలా, వుండనంటుందేమో?—

ఉండనంటుంది!...ఉండనంటే...తను తిండి బెట్టక మాడ్చి వేస్తాడుగాని ఊరుకుంటాడా?...తను ఎవరు?....భర్త.

ఓహో!....ఇది లాభంలేదు. అలా తను చెయ్యలేడు... కళ్యాణి అందరు స్త్రీలకు మల్లేకాదు....కళ్యాణికి తిండిపెట్ట కుండా మాడ్చి చంపటము....తన చేతిలోవున్న పనిగాదు.... కూటికీ గుడ్డకూ కళ్యాణి తనమీద ఆధారపడిలేదు....ఈ విషయం తనెప్పుడూ ఇంతలోతుగా ఆలోచించలేదు.... అవును, తనకూ కళ్యాణికీ మధ్య ఇది ఒక భయంకరమైన

అఘాతమే, ఇది తను ఇంతవరకూ అర్థం చేసుకోలేకపోయాడు... ఎక్కాంటెంటు యీ విషయాన్ని తనకంటే ముందు ఇంత సున్నితంగా చొచ్చుకుపోయి ఎలా అర్థం చేసుకోగలిగాడో!... ఏమో ననుకున్నాడుగాని, వాడి తెలివితేటలు తనకు తలకు మించినవిగానే వున్నయ్.

కూటికీ గుడ్డకూ కళ్యాణికి తన ఆసరా అక్కర్లేదు. తన కాళ్ళమీద తను నిల్చోగలదు. కావలిస్తే తనవంటి వాళ్ళకు 10 మందికి ఇంత తిండి పారవేయగలదు కూడా. అదేగా – 'సునాయాసంగా అయిదారు వందలు సంపాదించి అవతల పార వేయగలదు' అంటూ కళ్యాణి ప్రక్కన తన అసమర్థతను ఎత్తి చూపుతూ దెప్పి పొడిచాడు సెక్రటరీ.

అవును. కళ్యాణి తన చెప్పు చేతల్లో వుండవలసిన అవసరం యేమిటి?....

ఏమిటీ?...తన భార్యకు తనమాట వినవలసిన అవసరమే లేదూ?....ఎంత తలవంపు....ఇది అతని పురుష హృదయం భరించలేదు...ఇది తను సహించదు...ఈ విషమ పరిస్థితిని... వెంటనే....నిర్మూలించుతాడు....కళ్యాణి తన్ని లెక్కచేయకుండా నిర్లక్ష్యం చేసే దుస్థితి భయానకం...జీమూతాలు జడల విరబోసుకుని గంగళివాలాడే కాళరాత్రివంటి మృత్యువుకంటే అది భీభత్సం...ఉక్కుకోరల బ్రహ్మరాక్షసి, ఎరకోసం, నరక ద్వారంలా నోరు తెరుచుని, చీకటి మబ్బుల పొదలమాటున నక్కి, పొంచి, కనిపెట్టుకు కూర్చుంది...పొరపాటున ఆ దారిని అటువస్తే....తన జీవిత సర్వస్వాన్నీ....దడాల్న పట్టి మ్రింగి

వేయాలని. తను జీవితంలో ఎంతో అశ్రద్ధగా నిద్దరమత్తుతో నడుస్తున్నాడు——ఇది గమనించుకోకుండా!

అతనిక ఊరుకోడు...ముందుగానే తొందర పడతాడు... తన ఆత్మగౌరవాన్ని కాపాడుకోటానికి, అవసరపడితే తన ప్రాణాన్ని పణంగాబెట్టి పోరాడతాడు——ఈ విషమ సంఘటనలతో.

గొఱ్ఱెపోతు పోయి కొండను ఢీకొంటే!...కళ్యాణి ముందు తనెంత! కళ్యాణి ఒక పెద్ద బంగారుకొండ...ఆకాశాన్ని అంటి పెరిగిన మేరువు పర్వతం. తనూ? – గొల్లవాడు ఉన్నికూడా కత్తిరించుకుపోయి ఆ పర్వత చరియల్లో పూరిమేయాలిసిన ఒక చిన్న గొఱ్ఱెపిల్ల...తన ఆడదాని ప్రక్క తను ఒక గొఱ్ఱెపిల్ల... గడ్డిపోచ——

కాక మరేమిటి?...ముప్పైరూపాయిల ముండిమోపి కూలికి ప్రపంచం తన్ని అడ్డమైన పిచ్చికూతలూ కూసింది, కళ్యాణిని అలా మాట్లాడటానికి ఎవడికి దుమ్ములున్నయ్... అసలు, కళ్యాణి అలా ఒకసారి వీణ పట్టుకుంటే చాలు.... ప్రపంచానికి పిచ్చెత్తిపోయి, బంగారు రాసులు పాదాల దగ్గిర కుమ్మరించి, "దయవుంచి స్వీకరించండి" అంటూ బ్రతిమి లాడుతుంది.

తను కళ్యాణిని అదుపుచేస్తానంటే, అసలు దిక్కులన్నీ పరిహాసించి నవ్వుతాయల్లే వుంది.

నవ్వుతే నవ్వనీ...తను అదుపుచేసి తీరతాడు...కళ్యాణి తన భార్య..దాన్ని తన యిష్టం వచ్చినట్టు శాసించుతాడు...

ఇందులో ఒకడికి జోక్యమేమిటి? – కళ్యాణి తన ఆడది. ఎవడి కోసం పడివుంటుంది.

పడివుండనంటే ?—

పడివుండనంటే...తను మగబిడ్డ–యే దుండగాన్ని చెయ్య లేదు!

౨

"గగనానికి ఇలకూ, బహుదూరం బనినాహో..."

"హు" – అన్న దీన నిశ్వాసం...

"హు" – అంటూ అనుకంపించినై....ఆ వీణ తంత్రులు. పాపం, ఆ వీణ తీగలు కళ్యాణి హృదయస్పందన శాసనాలను అతిక్రమించి, ఎప్పుడూ నడుచుకోలేదు...అతః పూర్వం; ఈ దీన నిశ్వాసాన్ని అనుకంపించడంలో ఒక ధ్వనికి మారు మరొకటిగా...గజిబిజిపడ్డాయ్. ఆ రాగస్వరూపమే మారిపోయింది. సిగ్గుపడ్డ కళ్యాణి, తలెత్తి, తండ్రివంక చూచింది...ఆయన అదోలా దిగులుగా – కళ్యాణికి భయం వేసింది...తడబడుతున్న పాదాలు తండ్రి దగ్గిరికి చేరుకున్నాయి..

"ఏమిటి నాన్నా ?"...

వెన్నముద్దతో సహా, దొంగకృష్ణుడు యశోదకు దొరికి పోయాడు.

"ఎబ్బే....ఏముంది....ఏమీ లేదే" – అంటు సర్దుకో బోయాడు. ఆయన నేత్రాలు కన్నీటి పొరజాలులో, చేప పిల్లలులా మిలమిలా మెరిసి పోయినయ్...

"అమ్మ దొంగా! అదేం... ?"

"ఏదీ... నేను ఏడవం దే ?" సూత్రంతెగిన ముత్యాల పేరులా_కనుగొలకుల వెంట జోటజోటా కన్నీరు.

"నాకూ_డా.... ఏడుపొస్తోంది నాన్నా! - నా ముఖంలో ఆవిడ ముఖం చూచుకొని అమ్మని మరచిపోయా నని గొప్పలు చెప్పావ్; అన్నీ వట్టిమాటలేనా ?..."

"అమ్మకోసం కాదు నాయనా ?...కళ్లు బాగా వేడిజేసి నట్టున్నై...దానికోసం నేను దుఃఖపడవలసిం దేముంది?" అంటూ చిరునవ్వు బలవంతాన తెచ్చిపెట్టుకొని "అసలు ఆ యిల్లాలు మానవదేహంతోనే బ్రతకవలసి వుంటే ఆ అమాయిక హృదయం బరువులెత్తె ఈ మాధుర్యాలను భరించగలిగే దేనా ? అది మొదట్నుంచీ నా కంటే ఎలాగైనా తెలివితేటలు గల మనిషి...అందుకనే ముందుగా జాగ్రత్తపడి ముఖం తప్పేసి...స్వర్గధామానికంటూ వెళ్ళి పోయింది. అది నా కంటే లాగైనా జాగ్రత్తగల మనిషి మొదట్నుంచీ; అసలు ఆవిడ కోసం నేను పరితపించి లాభమేమిటి ?... తెలివిగలవాళ్లు పరీ క్షలో కృతార్థులై త్వరత్వరగా పై తరగతిలోకి వెళ్ళి పోతారు. నాబోటి బండబ్బాయిలు తప్పిపోయి చదివిన తరగతే తిరిగి చదువుతూ, తంటాలు పడుతూ వుంటారు,... ఈ మానవత్వంలో పవిత్రతకు ఒక అవధి వుంది, దాన్ని అధిగ మించితే ఇక్కడ వుండటానికి వీల్లేదు. యతమదేవుణ్ణి గర్భాన ధరించుకున్న మహాపుణ్యానికి...వస్తేనే గాని వీల్లేదని దెబ్బ లాడిమరీ మాయాదేవిని పుష్పవిమానంలో ఎక్కించుకుని, బల

వంతాన లాక్కుపోలేదూ దేవతలూ_యీ మానవలోకం నుంచీ ?_మీ అమ్మా అంతే! దివ్యగాంధర్వాన్ని ప్రసవించు కున్న మధుర హృదయానికి...మానవత్వంలో నా ప్రక్కన ఇక్కడ తావు కావాలని కోరటానికి నేనేం పిచ్చివాణ్ణను కున్నావా ?" _ ఏదో ప్రపంచంలోనుంచిలా చిరునవ్వు నవ్వుతాడు.

"అవున్లే_నన్ను గొప్పదాన్నవి ఉబ్బేసి అసలు విషయం మరిపించాలని చూస్తున్నావ్, అలా వీల్లేదు_చెప్పివెయ్యా లిసిందే."

"అమ్మకోసం గాదు సరా ?...మొదలే చెప్పానుగా అది ఒక పిచ్చిమాటనీ...అదొక తెలివితక్కువ...అనవసరంగా కలవరపడ్డాను...ఏమీ లేదు తల్లీ!..."

"ఏమిటి నాన్నా !"_అని మూతిముడిచి, భుజంమీద పడుకుని మారాం జేస్తుంది.

అయోమయంగా "నీ పక్కకింద పెట్టాను...చూళ్ళేదా ఇంకా...అతను ఉత్తరం వ్రాశాడు...ఎల్లుండి వచ్చి తీసుకు వెడతానని"—

"చూశాను నాన్నా...ఏం ?"

"పిచ్చిమాటని మొదలే చెప్పానుగా...నీ సంగీతం విన కుండా బ్రతకలేనని యేమిటో....భయం వేసింది....తెలివి తక్కువగాక మరేమిటి !"

"ఓహో...అదా ? _ పోనీ మరొక నెలవుండి పంపుతా నని వ్రాయలేక పోయారా ?"

"అలా అతనికి అడ్డు చెప్పటానికి నాకేమిటి అధికారం? ఎప్పుడైనా వున్నదేనాయె...అయినా, నీ హృదయం రెక్కలు విచ్చుకుని, అతణ్ణి చేరుకోవాలని ఉబలాటపడటం...అది నేను ఇంకా గమనించలేదనే?"—తండ్రి తన్ను యెప్పుడో పట్టివేశాడని సిగ్గుపడ్డది, కళ్యాణి...చెక్కిళ్లు ఎర్రబడ్డయ్.

"పోనీ....నాన్నా! ఇక్కడ ఏముంది? ఒంటరిగా ఇక్కడ వుండకపోతే, ఈ యిల్లు అద్దెకిచ్చేసి నీవు కూడా నాతో వచ్చేసి వుండిపోతే బాగుండదూ?"

"అలా నేను చేయలేను నాయనా!"

"పోనీ...ఆయన్నే ఇక్కడ వుండమంటే?"

"ఛీ! తప్పు!" – చరాల్న క_త్తిరించినట్టుగా, మందలించాడు.

"మీ రిద్దరూ సుఖంగావుంటే నా కది చాలు.అంతకంటే అతన్ని నేను మరేమీ యాచించను...మరేం ఫరవాలేదు... నెమ్మదిగా అలవాటు చేసుకోగలనులే...ఈ విషయం నీవు బెంగగా ఆలోచించకు...సంతోషంగా వుండు...దిక్కుముఖంతో అతనికి నువ్వు కనిపించటం–అది నాకు ఇష్టంలేదు...ప్రయాణానికి కావలసిన యేర్పాట్లు చూస్తున్నాను."

"శ్రుతి తంబురా ఒకటి పెద్దది కొనుక్కురా నాన్నా... కొంచెం మంచిదిగా చూసి."

## ౬

ఉగాది—

"క్షమించాలి – వసంతకోకిల శ్రీమతి కళ్యాణిగారి వీణా వాదనం ఉగాది కానుకగా అర్పించుకుంటామని లోగడ ప్రకటించాం. వారి అనారోగ్య కారణంగా అలా చేయలేక పోయాం. ఇప్పుడు మా స్టేషన్ విద్వాంసులు ఒకరు వీణ వాయించుతారు"–అంటూ చిన్న క్షమార్పణ చెప్పుకున్నారు రేడియో స్టేషన్‌నుంచి...

సొంత సెట్టులేని ఒక పేదరసికుడు, పార్కులో కూర్చుని ఈ మాటవిని, నిరుత్సాహపడి, కాళ్ళీడ్చుకుంటూ ఇంటికి చేరు కుంటున్నాడు... "అయ్యోపాపం! ఆ తల్లికి జబ్బేమిటో!" అనుకుంటూ.

* * *

"చాలా చీకటిగా వుంది కళ్యాణి!...ఊపిరాడటంలేదు... వద్దు...చిమ్నీ అలా హెచ్చించకు...ఇప్పటికే అది కొరివి దయ్యంలా మండుతోంది...దాని వంకచూస్తే గుండెలు కొడిగట్టి పోతున్నట్టుగా వున్నయ్...సొంతం ఆర్పివెయ్యి..."అది కొడిగట్టి మండినకొద్దీ, జడలు విరబోసుకుని చీకటి పిశాచాలు గదంతా తందనాలు త్రొక్కుతున్నయ్...

గదంతా అంధతమసం...ఆకాశంలో నన్నా యేమైనా కొంచెం వెలుగుందేమో?...కిటికీ పై రెక్కల్లో ఒకటి తెరిచాడు – కారుమబ్బుల కాళరాత్రి...జీమూతాలు పకుగులు

తోలుతున్నయ్, ఆకాశమంతా…ఆకాశం వంకచూసి హడిలి పోయిన కాకికూన కళవళిస్తూ, తల్లికాకి రెక్కలో దూరి, తల్లిని లేపుతోంది…దొడ్లో బాదంచెట్టుమీద.

"మ్చ్!… ఈ చీకట్లో ఇక బ్రతకలేను" … నిరుత్సాహంగా కిటికీ రెక్క మూస్తాడు…

"హూ…" అన్న దీనవిశ్వాసం;—చీకటి దేవత గదిలో మెలిసినట్లయింది. కల్యాణి మునివ్రేళ్ళు నిస్పృహ దేవత విశ్వాసాలులా…ప్రాణంలేని గాలితీగెలులా అతని భుజాన్ని తాకినై.

"కల్యాణీ! పాపం నువ్వువచ్చి రెండు మాసాలయి నట్టుంది."

"హాఁ"—

"మీ నాన్న దగ్గిరికి పంపనా? పదిరోజులు వుండి వద్దువుగాని."

"అపచారం?…"

"అబ్బా! అదేంమాట…గుండెల్ని అలా మెరుపు కత్తిలా సర్ ర్…కోసుకుపోయిందీ?…అపచారమనిగాదు. నువ్వు చాలా జబ్బుగా వున్నావ్—మీ నాన్నమీద బెంగగా వుం దేమోనని—"

"నేనేం పసిదాన్ననా?…గంపెడాశలు. ఒడిగంటి రాజనాలులా, మాటగట్టుకుని మీ పాదాలదగ్గరకు చేరు కున్నాను. మీరాకకు యుగయుగాలుగా ఎడతెగని చీకటి రాత్రులెన్నో ఎదురుదాటులు చూచాను. నన్ను తేఁమి వెయ్యాలని చూడకండి…మళ్ళా ఒంటరివాన్ని చెయ్యకండి,

ఒంటరిగా బ్రతికే తాహతు ఇప్పుడు నాకులేదు. నేను చాలా అలసిపోయాను.,.నాకు చిన్నమెత్తు ప్రాణమైనా లేకుండా పోయింది. నా కాళ్లుగుడ్డ పీలికలల్లే గాలిలో తేలిపోతున్నై... కాలూది నిల్చోలేకుండా వున్నాను. ఇప్పుడు నాచెయ్యి జార విడువకండి...నిల్చోలేను...మీ తొడమీద పడుకుని...ప్రాణం విడుచుకోనివ్వండి——"

కళ్యాణిని తొడ మీదికి తీసుకుని, రేగిపోయినజుట్టు సరి చేస్తూ——

"నీవు నా ప్రక్కన నిల్చివుంటే నా హృదయంలో వెండివెన్నెలలు వెల్లివిరిసిపోయేవి కళ్యాణీ!..కాని.. ఇప్పుడు.. నా ఆనంద చంద్రుడు మసకమసకవేసి పోయాడు...కారు మబ్బులచాటున ప్రాణరహితమైన విస్పృహా దేవత చీకటి క్రీనీడలా అయోమయంగా నీవు నా జీవితంలో మెసులుతూ వుంటే···నాకంతా···చీకటి చీకటిగా···కారుమబ్బుల కాళ రాత్రిలా కీచుమంటూ···జిమ్ముమని దుఃఖం ముసురులువేసి ముంచుకువస్తోంది :

"ఔను ప్రభూ! నేను దినదినం చీకటి చీకటిగా చివికి అంధకారపు ఆత్మలా అయోమయమైపోతున్నాననే యేడు స్తున్నాను. నా హృదయంలోకి తొంగిచూస్తే దీపాలు ఊది వేసిన నర్తనశాలలా అంధకారం ఆవలిస్తూ భయంకరంగా వుంది. నిస్పృహా దేతవ దుఃఖగీతిలాకడలేని అశ్రురాల కంకా ళంగా కాలి కావురు వేసిపోయాను. నిశ్శబ్దశోకగీతినై ప్రపం చావధులదాకా విషాదాన్ని చలిగుబుళ్లులా మోసులెత్తి

స్తున్నాను...అభాగ్యురాల్ని—నా పుట్టుక భారత మహిళా లోకానికే అవమానకరం. భర్త జీవితానికి కావలసిన వెలుగు నివ్వలేని స్త్రీత్వం ఎంత నీచం...ఇది నా తండ్రికి తెలిస్తే... నన్ను కన్నందుకు ఎంత అవమానపడి అటమటించి యేడుస్తాడు...అయ్యో!..."

"భయపడకు కళ్యాణీ!...నీ హృదయంలో నా కింకా ఆశాకిరణాలు కనుపించుతూనే వున్నాయి ... వాటి సహాయంతో...వెన్నెల బయలులోకి దారేమన్నా దొరుతుందేమో వెతుక్కుంటాను."

"లాభం లేదు ప్రభూ! దీపకళికను ఆర్పుకుని, చీకటిగా వుందని బాధపడుతూ, అంధకారంలో తమ్ముకుని ఆయాసపడి లాభమేమిటి?"

"ఏమిటి కళ్యాణీ!...ఈ చీకటి కంతటికీ బాధ్యుణ్ని నేననేనా?"

"మీా పాదాలు అంటుకోనీయండి...నేను బ్రతకాలని ఆశించుతున్నాను...కాపాడరూ?..."

"నాకు అర్థం గావడం లేదు కళ్యాణీ!...నేను నిన్ను చంపుకోవాలని చూస్తున్నానంటావా? ... నేనిక్కడ నీకేం తక్కువ జేస్తున్నాను? పోనీ, అంటే అను...నన్ను అలా నిందించటంలో నీకు శాంతి లేశమేదైనా లభించితే పోనీ, అలానే అను...నే నేమీా అనుకోన్లే..."

"నా హృదయపు జ్యోతిని ఆర్పుకుని నీూరు చీకటిలో

బాధపడకండి...మన జీవితాలు అంధకారమయం చెయ్యకండి. నా జ్యోతిని నాలో వెలుగ నియ్యండి. వెలుగు జిలుగుల లీలావసధాన్ని తమకు మళ్లు కట్టుకుంటాను, అనుగ్రహించండి."

"తిన్నగా చెప్పు కళ్యాణీ! ... నన్నిప్పుడేం చెయ్యమంటావు?...నీ కోసం నేనే త్యాగం చెయ్యటానికి వెనకాడతాననీ?..."

"సంగీతం కళ్యాణి హృదయానికి ప్రాణజ్యోతి–వెలుగు నియ్యండి; కళ్యాణిని బ్రతకనియ్యండి...మీ జీవితానికి వెలుగు గీతికల వెన్నెల హారతులు అర్పించుకోవాలని యుగయుగాలుగా ఆశతో కనిపెట్టుకు కూర్చున్నాను. ఆశీర్వదించండి – నా హృదయజ్యోతిమీద శాసించిన ఆంక్షను తొలగించండి – జీవితాశ దాహంలా ఆర్చుకుపోతుంది...బ్రతికించండి."

"కళ్యాణీ!" – కఠోరంగా శబ్దించినై – ఆడాబా తనా బీలు.

జీమూతాలు శోకాలో మెసిలి కల్లోల పెడుతుంటే... ఆకాశానికి పిచ్చెత్తిపోయింది...ఫెళ ఫెళా...ఫెళ ఫెళా...పిడుగు లురిమి, భూమాతను భయపెట్టింది.

"ప్రాణంలేని క్రీనీడ బ్రతుకు ఇక నేను బ్రతకలేను. ప్రభూ?"—

"కళ్యాణీ! ఇది పెంకెతనం...భర్తకు ఎదురు తిరగాలని చూస్తున్నావ్ – నీ తంబురా నేను మొయ్యను!"

౭

శాపగ్రస్తుడై, మూగవోయిన నారదుడు ముగ్ధ హంసగా మారి, ముక్కు హృదయంలో గుచ్చేసుకుని, అర మోడ్చిన కళ్ళతో, ఆకాశగంగలో, ఆవేదనతో...అటమ టించి పోతున్నాడు. తల్లి హృదయం తరుక్కుపోయింది... కరుణవాహినిలా పాదాలు కదిలివచ్చినై. నీటి పొరజాలు మీదుగా నడిచివెళ్ళి, కలహంసను కరస్పర్శతో కాస్త అనున యించింది. శాపవిమోచనాన్ని పొంది నారదుడు, తల్లి పాదా లకు నమస్కరించాడు; మహతిమీద మధురాతి మధురంగా ఒక రాగమాలికను వాయించి, తల్లి కంఠంలో కత్తెరదండగా వేస్తున్నాడు—

చలువచేసిన తెల్ల దుప్పటిపరిచి పాలవెల్లిలా వుంది- ఆ పందిరి మంచం. మంచం నడాన మోకాళ్ళమీద తల వేల వేసుకుని శోకమూర్తిలా దిగులుగా కూర్చుంది, కళ్యాణి.

అకస్మాత్తుగా ఒక్కమెఱుపు మెఱిసినట్లయింది- కళ్యాణి హృదయంలో. గప్పున ఒక చుక్క గగన మండలంనుంచి రాలిపడి, రప్పుమని వెలిగిపోయిన అమవస రాత్రిలా ఒక్కసారి తేజోమయమై పోయింది. ఆశాజ్యోతులన్నీ అంటుకున్నయ్.

"అవునవును...అవునవును"...అంటూ దబదబా పక్క దిగి, చరచరా సావట్లోకి నడిచింది...పాలవెల్లి మధ్యనుంచి ప్రవహించిన అమృత వాహినిలా—

"ఎక్కడికి బయలుదేరారూ?" విదియచంద్రుడు ఒక్క ప్రాణంతో ఆ పెదవులమీద చిరునవ్వు చిలికాడు.

మతి భ్రమణం కూడా కలిగిందల్లే వుంది- అను కున్నాడు...“ఏమిటి కళ్యాణి!” అంటూ కంగారుగా దగ్గరకు వచ్చాడు.

“తలంటి పోస్తాను-పోయించుకోరూ!”

ఏమి చెయ్యాలో తోచలే దతనికి...డాక్టర్‌ను పిల వాలా?...తండ్రికి టెలిగ్రామిస్తే...కలవర పడుతున్నాడు.

“ఇవ్వాళ నా పెళ్ళయినరోజు-పండుగ చేసుకుంటాను.”

“అవును. ఆ మాట నిజమే...కళ్యాణికి ఈ స్థితిలో ఇది ఎలా జ్ఞాపకం వచ్చింది.”...అని ఆశ్చర్య పడుతున్నాడు. “అయినా, పెళ్ళిరోజు పండగ చేసుకోటం...ఎక్కడా విన్లేదే” అనుకున్నాడు మళ్ళా.

“ఏమిటి?...మాట్లాడరేం?”

“నిజంగానా?”

“నిజం, నిజం, రండి రండి” అంటూ, కులుకుతుంటూ వచ్చి, రెండుచేతులూ పట్టుకుని స్నానాలగది దగ్గరకి తీసుకు పోతోంది. మతి చెడి ఏదో ప్రపంచంలోకి పోయినట్టుగా... అతని కిదంతా అయోమయంగా వుంది.

*        *        *

ఆ సాయంత్రం—

అతను క్లబ్బుకు వెళ్ళబోతున్నాడు-సంపంగి నూనె రాచి, పక్క పాపిటి తిన్నగా తీసి, వంకెలు వంకెలుగా వచ్చే టట్టు క్రాప్ జాగ్రత్తగా దువ్వింది. “ముద్దులు మూటగట్టే ఇలాంటి ఉంగరాల జుట్టు నాకు వుంటేనా! ఎన్ని ఎన్ని పిన్నులు

బెట్టి తంటాలుబడ్డా...మ్చ్. లాభంలేందే!" అని ముగిసింది. కనుబొమ్మల మధ్య చాదుచుక్క తీర్చిదిద్ది, చెక్కిళ్లు పుచ్చుకుని వారగా సౌందర్యం చూసింది. "పెళ్లికొడుక్కు బుగ్గన చుక్క బెట్టేనా? పాపం, క్లబ్బులో వాళ్ళంతా వేళాకోళం చేస్తారని మీకు బిడియమేమో...సరే, ఇంటికి తిరిగి వచ్చిన తరవాత ఆ అలంకారం...అప్పుడుమటుకు తప్పించుకోటానికి చూడగూడదు!"

"సరే! అలానేలే! నీ ముచ్చట నేను మటుకు ఎందుకు కాదనాలి?"

పెళ్ళినాడు తన తండ్రి బెట్టిన సేలం కండువా తీసి అతనిపై కప్పింది.

"ఎబ్బెట్టుగా వుంటుందేమో...పోనీ, ఇది వేసుకోక పోతేనేం కళ్యాణి?"

"అలా వీల్లేదు...ప్రతిదానికీ మీ అధికారమేనా?" ఉత్తరీయం కంగులు ముడిగా ముడిచి కట్టింది.

"క్లబ్బునుంచి త్వరగా వచ్చెయ్యాలి...నే నీలోగా సింగారించుకొని సిద్ధంగా కూర్చుంటాను."

ఇవ్వన్నీ మంచి చేష్టలో-పిచ్చో అతనికి అర్థంకాలేదు. ఆలోచించుకుంటూ బయటకు వెళ్ళాడు.

*　　　*　　　*

కళ్యాణి పెళ్ళికూతురు సింగారం పూర్తి అయింది. కాళ్లకు పారాణి, బుగ్గవి చుక్కతోసహా - పెళ్లినాటి బనారసు చీర - కీల్జడా, కటిపైన ముద్దులు మూటగడుతూ చివర జడకుచ్చులూ. నిలువుటద్దం ముందునుంచుని నుదుట కళ్యాణం

బొట్టు దిద్దుతుంది_రేఖలుగా. అద్దంలో అందం చూసుకుని ముసిముసి నవ్వుల్లో మునిగిపోయింది.

౮

క్రళవళపడుతున్న హృదయంతో క్లబ్బునుంచి ఇంటికి వచ్చేస్తున్నాడు_చకచకా. వీణా నినాదాలు భోరుకొలిగి పోతున్నాయ్, ఆ వీధంతా. కళ్యాణి మధురకంఠం వెలార్చే గాంగ నిర్ఝరులతో కలిసి ఆ వీణ పరుగులు తీస్తోంది, యమునా వాహినిలా.

అవమానంతో అతని ముఖం నెత్తురు ముద్దలా జేవురించి, భీభత్సమై పోయింది.

"ఆఁ! ఏమిటీ తిరుగుబాటు!"_దబదబా మెట్లెక్కి_సావిట్లోకి వెళ్ళాడు.

గాన మధువీచికల
కలహంసవై___విరతి,
కన్నుమూయర సామి!
కళవళింపగ నేల ?... ॥గా॥

ఉయ్యాల జొంపాల
ఊతునా నా సామి!
వెయ్యారు గీతికల
విరిసిపోదును లేర... ॥గా॥

ముత్యాల శాలలో,
ముగుద మానసములో,

విరజాజి దీపికలు
వెలిగించితిని రార !...      ॥గా॥

సోనలు సోనలుగా, తీపి తేనెల మధుర నినదాలు వర్షించుతున్నయ్–ఆ గృహమంతా. బంగారు పువ్వుల్లా, సప్త స్వరాలూ, జల్లులు జల్లులుగా తడిసి ముప్పందుమై తడబడి పోతోంది, కృష్ణరావు హృదయం.

అగ్నిరేఖను ఆర్పివేయాలని తూనీగబారులు తుటారా లాడుతున్నయ్–రెపరెపలాడుతూ యింకా రెక్కలు గాల్చాలని చూస్తోంది – ఆ శిఖరేఖ.

ఆ వీణా నినాదాలకు ప్రతికంపనాన్ని పొందినయ్, అతని హృదయ తంత్రులు...కంపించి, కంపించి, కల్లోలంగా కదలిపోతున్నయ్...ఆచినా ఆగక ! అతనికి హృదయమే వున్నట్టు తోచలేదు. అతని హృదయమే ఒక విపంచిగా మారిపోయింది.

పరుల వీణలనైతే పాషాణపాకంగా పట్టుబట్టి, "పార వేస్తావా ? చస్తావా ?" అని బలవంతాన ప్రాణం తీసెయ్యొచ్చు...తన హృదయమే తనకో వీణైకూర్చుంటే !

వీణతంత్రులైదూ, అయిదు సెలయేళ్లయినయ్, అతని హృదయంలో...కలకలా క్రమస్వనాలుగా, మూర్ఛరించుతూ– స్థాయినుంచి స్థాయికి లేడిపిల్లలులా చెంగుచెంగున దూకుతూ– గత్తుమీద గత్తు, గమకంమీద గమకం, పరుగులు దీసుకుంటూ ప్రవాహాలైపోతున్నయ్ – అతని హృదయ తంత్రులు.

ఎక్కడో ... శతసహస్రార్బుదయోజన పరిదీర్ఘమైన

యేదో అజ్ఞాతంలో…చీకటి చింతల చిక్కతోపులలోనుంచి, గుడ్డిగొక్కి—రాయి కళవళించినట్టు…"కళ్యాణితంబురామోస్తావా యేమిటి? … ఎంత అవమానకరం? … ఎక్కొంటెంటు ఏమ న్నాడూ?" అంటూ మూగగొంతుతో మూలగబోయింది అతని మనస్సు.

ప్రజాహృదయంలో వెల్లువలై వెల్లివిరిసిన, ఆ గంగా నిర్ఝరుల మధు ఘోషల కల్లోలాలలో, ఈ అపస్మారపు పక్షి గొణగటం ఎవరికి వినుపించుతుంది?

అతని హృదయ నిర్ఝరులు, గగనంకష కల్లోలంగా కెర టాలు ఎగుర వేసుకుంటూ, పాటలు పాడుతూ ప్రవాహాలైనయ్.

"ఉయ్యాల జొంపాల
ఊతునా నా సామి?
వెయ్యారు గీతికల
విరిసిపోదును లేర
ఉయ్యాల…జొంపాల—"

ఆకాశం అవతలి కొసనుంచి, యివతలి కొసదాకా ఊపిరాడకుండా – ఊపుమీద ఊపు…ఊగి పోయింది అతని హృదయం…హాయిలో అరమూసిన కన్నులు, అలా అలా కొంచెం విప్పిచూసేసరికి, కళ్యాణి గది గడపముందు నిలు చున్నాడు—

"ముత్యాల శాలలో
ముగుద మానసములో

విరజాజి దీపికలు
వెలిగించితిని రార—"ము"

ఓరగా మూసివున్న తలుపులు ఒత్తిగిలించాడు. ఆనంద తారల దివ్య దీపావళిగా వుంది ఆ గది. "ఆ! ఎవరా తేజోమయి!" గాలికొాదమలా నిశ్శబ్దంగా అడుగులు లోపలకి వేశాడు.

రాగరస సమాధిలో మునిగి, రాజహంసి లా వుంది కళ్యాణి – ఆ ముఖంలో ప్రపంచాతీతమైన ఏదో ఒక దివ్య జ్యోతి…భర్త లోపలికి వచ్చిన సంగతే గమనించలేదు కళ్యాణి. భర్త కళ్యాణిని పలుకరించనూ లేదు.

చాదు భరణిలోనుంచి కొంచెం చాదు తీసి, బుగ్గన చుక్క బెట్టుకున్నాడు. మూలనున్న తంబురా తీసుకుని కళ్యాణి వెనకకుపోయి నిశ్శబ్దంగా కూర్చుని శ్రుతి వేస్తున్నాడు…

"ఆరి మీ యిల్లంతా బంగారమైపోను. 'మొగుడూ పెళ్ళాం సంగీతాలలో మునిగి తేలుతున్నాం – మేం రాం పొమ్మంటే పోదూ?…పిల్లకు జబ్బుగా వుందని రేడియోలో చెప్పిస్తే, పెద్ద ప్రాణం నేనేం గావాలని?…నిత్యకళ్యాణాలా యేమిటి–బుగ్గల్ని ఆ చుక్కబొట్లేమిటి?" అంటూ గది గుమ్మంలో నిల్చున్నాడు కళ్యాణి తండ్రి.

# బూ రె ము క్క లు

ఆ పసిబిడ్డ బక్క-పలచగా, ఎర్రగా, తెల్లగా వున్నాడు. చిన్ని చిన్ని రాగి వెంట్రుకలు చిరుగాలికి కొసలు రేగి, కొంచెం కొంచెం పెంకెతనంగా కనుపించుతున్నాడు. సన్నని ఆ మెళ్ళో జెర్రి పోతులా ఒక బంగారు నానుతాడూ, దాని చివర ఒక పులి గోళ్ళ పతకం వ్రేలాడుతున్నయ్. దిగంబరి; ఉండీ లేనట్లున్న ఆ చిట్టిచిట్టి పిరుదుల మీదికి, జారిజారి పోతుంటూ, మొల చుట్టూ ఒక బంగారు గజ్జల మొలత్రాడు.

తొందర తొందరగా నడవాలనే ఉత్సాహమంతా, తడబడుతున్న ఆ తప్పటడుగుల్లో కనిపించుతూనే ఉంది. ఆలంబనం కోసం అనసాగిన లేత బచ్చలి తీగెలా, ఆ సన్నటి-మెత్తటి చెయ్యి చాచి, మునివ్రేళ్ల చివరలతో ఆ స్త్రీ కుడి భుజాన్ని అందుకోబోతున్నాడు. ఆ ముంజేతి చివర ఆ చెయ్యి మొయ్యలేనంత బరువుగా ఒక బంగారు పలకల గాజు, వదులై-జంగిడంలా వ్రేలాడుతోంది.

ముసి ముసి నవ్వుల 'సన్న జాజులు' మోవికొసలలో మోసులెత్తుతున్నయ్. ఆ స్త్రీ భుజంమీద ముని వ్రేళ్ళాని, వారగా తలవంచి, ఆ స్త్రీ ముఖంలోకి తొంగిచూచాడు. చిరునవ్వుతో. ఆ బిడ్డను ఒళ్ళోకి ఆహ్వానించింది ఆ స్త్రీ. అడ్డాలలో పడుకో బెట్టుకుని రొమ్ము నోటికందించి పైట చెంగు కొంచెంగా కప్పింది. ఆ స్త్రీ ముంజేతుల మీదుగా రెండు మీగాళ్ళూ జారవేసి, ఒక లయలో ఊపుతూ ఒళ్లు మరచి

పాలు త్రాగుతున్నాడు ఆ బిడ్డ. కాళ్లకు కట్టివున్న వెండి గజ్జల జత, ఒకదాని కొకటి కొట్టుకొని, 'జగ్-జగ్-జగ్' మంటున్నయ్. ఆ బిడ్డ త్రాగుతున్న స్తన్యం రక్తంగా మారి, పాదాలకు వ్యాపిస్తున్నట్టు, పాదాలు తామర రేకుల్లో కెంపులు దేరుతున్నయ్.

ఆ స్త్రీ చామనచాయ వర్ణంలో కొంచెం భారీ మనిషి. బలిష్ఠమైన అవయవాలు. నాజూకుతనం కొరకపోతే, ఆరోగ్యంతో కండలు తేరిన అందమైన చెక్కిళ్లు. కనుమాసిన ఆ 20వ నెంబరు నేతచీరా, వెలిసి - బూడిదై పోయిన ఆ ఎఱ్ఱ బొంబాయి రవికా, ఆ తల్లి పేదరికాన్ని దాచలేకుండా వున్నయ్. చాలా మితభాషిణి. ఎప్పుడూ మాట్లాడినట్టే ఉండదు! అథవా యెప్పుడైనా పెదవి కదిపితే, ముసిముసి నవ్వులు ముందు జారిపడిగాని పలుకులు బయటికి రాలేవు.

పండు తమలపాకుల పసిడి చెక్కిళ్లతో, పసిడి పువ్వుల యఱ్ఱ బనారసు చీర కట్టుకొని మరొక ఇల్లాలు అక్కడికి వచ్చి ఆగింది. తెలుగు జాతిలో ఆవిడ చాలా అందగత్తె ననాలి. ఇరవై యైదు సంవత్సరాల వయుచు ప్రాయంలో, బక్కపలచని నాజూకు మనిషి. పచ్చటి శరీరంమీద ఆ కాసుల బంగారపు నగలు, యెందుకూ కొరగాక వెలా తెలా బోతున్నయ్.

"సుబ్బలక్ష్మీ! తరిపి దూడలా ఇంకా వాడికి పాడిలేమిటి? చేరనివ్వకూ! ఎన్నాళ్లు పోయినా వాడలానే పీకుడు-

తింటూ వుంటాడు. గూబమీద వెయ్యి వెధవని"...అన్న దావిడ.

సుబ్బలక్ష్మి ఒక చిరునవ్వు నవ్వి, నిర్లక్ష్యంగా మెళ్ళో వున్న నల్లపూసలు సర్దుకుంటోంది.

ఈ మాటలు చెవులబడి, ఆ బిడ్డ త్రాగే త్రాగే రొమ్ము చివాలున వదిలేసి, ముసుగ్గా కప్పివున్న పైటచెంగు 'చెక్'న అవతలికి త్రోసేసి, ఆ వచ్చిన యిల్లాలి వంక చుర చురా చూశాడు. చారెడేసి వున్నయ్ ఆ కళ్లు. అలా చూడ్డంలో ఆ కళ్లల్లో వున్న రక్తపు జీరలు మరింత యెఱ్ఱ బడ్డయ్. కుడికంట్లో వున్న నల్లటి పుట్టుమచ్చ-ఆ అరుణరేఖల నడుమ మిలమిల లాపోయింది.

ఆవిడ నవ్వుతూ, "ఏడిశావ్ - వెధవా!" అంది.

సుబ్బలక్ష్మి చిరునవ్వు నవ్వి, ఆ బిడ్డను హృదయానికి హత్తుకుంది. మళ్ళా రొమ్ము నోటి కందించి, పైట చెంగు కప్పేసింది.

తనే జయించాడు. ఆ సంగతి ప్రదర్శించి తన్నలా మాట్లాడిన ఆ స్త్రీకి కుళ్లుమోతుతనం తెప్పించాలి. పాలు త్రాగుతూ పాదాలు ఇందాకటికంటే మరింత జోరుగా ఊపేశాడు.

"ఆ! నీవలా వాణ్ణి ముద్దు జూపినకొద్దీ వాడు నెత్తి కెక్కుతా డు. వాడి జాతేం జాతీ!" అంటూ, నవ్వుకుంటూ వెళ్లిపోయింది ఆ యిల్లాలు.

సుబ్బలక్ష్మి ఆ బిడ్డను ఆప్యాయంగా, హృదయానికి

హత్తుకుంది. గర్వంతో సుబ్బలక్ష్మి ఎడవ భూదేవి వక్షస్థలాలం, మరింత విస్తృతమై విచ్చులుకుని ఆ బిడ్డకు ఆశ్రయమిస్తోంది.

*　　　*　　　*

అతఃపూర్వం జరిగిన విషయాలేవీ నాకు తెలియవ్. ఈ జీవితంలో నాకు కొంచెం బుద్ధి తెలిసీ తెలియడంతోటే నాకు అవగతమైన మొట్టమొదటి ఘట్టం ఇదే. అప్పట్లో నా ప్రపంచమంతా ఆ ఒక్క సుబ్బలక్ష్మే! తక్కిన విషయాలేవీ నాకు తెలిసేవీ కావూ; తెలుసుకోవాలనే అవసరంగాని, ఉత్సాహంగాని, నాకు ఉండేవీ కావు.

నన్ను గర్భిణితో వుండగా మా అమ్మకు చాలా జబ్బు చేసిందట. నీళ్ళాడాక ఆవిడ దగ్గిర పాలు లేకపోవటంచేత నేను పుట్టినప్పటి నుంచీ లక్ష్మే నాకు పాలిస్తూ వుండేది. మా యింట్లో పనంతా లక్ష్మే చేస్తూ వుండేది. బయట మా పొలం పాటంతా లక్ష్మి పెనిమిటి సుబ్బన్న చూస్తూ వుండేవాడు. వంట చేసుకోటం, భోజనం చెయ్యటం—ఇవే మా అమ్మకూ, బామ్మకూ మిగిలే పనులు. చేతినిండా పనిలేక వాళ్ళకేమీ తోచేదిగాదు. ఏదో చిలిపి తగూ ఒకటి లేవదీసి, ఒకరినొకరు ప్రొద్దస్తమానమూ, తెగ సాధించుకుంటూ వుండేవాళ్ళు — వినేవాళ్ళకి తల వాచిపోయేలా.

ఇంటెడు చాకిరీ సుబ్బలక్ష్మే యెముకలు విరుచుకుంటూ వుండేది. తెల్లవారు జామున యెప్పుడు వచ్చేదో, నేను నిద్దర లేచేటప్పటికే బండెడు చెంబులు ముందు వేసుకుని—వాటికి చింత పండు పులుసూ, వెలిబూడిదా పట్టించి తోముతూ వుండేది.

నిద్దరకళ్ళు నులుపుకుంటూ వెళ్ళి, ఆ వీపుమీద పడుకునేవాణ్ణి. మళ్ళా ఒక గ్రుడ్డికునుకు తీసేవాణ్ణి - మా అమ్మ బలవంతాన అన్నానికి పడలాక్కు-పోయేదాకా. ఆ వెన్నుమీద నాకు లభించిన శాంతి, మళ్ళా నా జీవితంలో ఇంతవరకు మరొక తావున, ఇంకెక్క-డా లభించలేదు. మా అమ్మ ఎప్పుడన్నా కాసేపు ఎత్తుకుంటే, 'ఎప్పుడు దించుతుందిరా బాబూ!' అని పించేది. ఊకదాలిబెట్టి, కిటికీలు మూసివేసిన గదిలా, ఉక్కి-రి బిక్కి-రిగా ఉండేది. ఎప్పుడూ సుబ్బులక్ష్మి కొంగుకొన పట్టుకు నేను తిరగటం మా అమ్మకి కొంచెం చిరాకుగానే వుండేది. మా అమ్మకూ, నాకూ సంబంధం యేమిటో నా కర్థమయ్యేది కాదు. అప్పుడప్పుడు మా అమ్మ నామీద అధికారం చలా యిస్తూ ఉండేది. ఏ అధికారంతో ఆవిడ అలా నా మీద జులుం చేస్తూందో నాకు తెలిసేది కాదు. అట్లాంటప్పుడు— అనవసరంగా, అక్రమంగా, దుండగంగా శిక్షింపబడుతున్న ఒక పెద్ద 'మార్టీరు'కు కలిగే భావాలన్నీ నాలో కలిగేవి. 'కొట్టు కుంటే కొట్టుకో' - అనే అర్థం తోచేలా నిర్లక్ష్యంగా నిల్చుని సత్యాగ్రహం చేసేవాణ్ణి-బుగ్గలు ఎంతైనా మెలేసుకోనీ. కాని, లక్ష్మి గనక అక్క-డుండి, మా అమ్మను కొట్టనియ్యకుండా అడ్డొచ్చిందా - ఇక జూసుకోండి, గగ్గోలుగా ఏడ్చుకుంటూ, పెద్ద పెట్టున, ఒక విప్లవం లేవదీసేవాణ్ణి.

రోజులు గడిచినకొద్దీ, సుబ్బులక్ష్మినుంచి నన్ను దూర దూరం చేసే సంఘటనలు ఎన్నో కల్పింపబడుతూ వుండేవి.

అలాంటప్పుడు ఒళ్ళంతా కుదించేసుకుని సుబ్బులక్ష్మిని అలుముకు పోవాలనిపించేది.

సుబ్బులక్ష్మి నాకు నాలుగు చుక్కల పాలిస్తుందనీ, వాటి కోసం నేనలా ఆశ్రయించుకు తిరుగుతాననీ మా అమ్మ నన్ను యాసగా దెప్పిపొడుస్తూ వుండేది అప్పుడప్పుడు. కాని, ఆవిడిది వట్టి తప్పభిప్రాయమని రుజువు చెయ్యగలను. మా అమ్మ నాకు ఒక పెద్ద వెండి గిన్నెడు పాలు ప్రొద్దునా, ఓ పెద్ద వెండి గిన్నెడుపాలు సాయంత్రం త్రాగించేది – పంచదార కూడా వేసి. త్రాగకపోతే గవద బద్దలు కొట్టి మరీ త్రాగించేది. మరి, ఆ వెండిగిన్నె కోసంగాని, మా అమ్మకోసంగాని, నా మనస్సు అలా వెంపర లాడేది కాదేం? మా బామ్మ నాకు పట్టెడు పట్టెడు వెన్నపూసా, మీగడా పెడుతూ వుండేది. ఆవిడకూ, నాకూ మధ్య మాత్రం యీ అంతర్యమేదీ?

ఎవళ్ల లోపం వాళ్లు కప్పుకోడానికి ఏదో అభూత వాదాన్ని ఒక దాన్ని లేవదీసి ప్రచారంలోకి తెస్తూవుంటారు. మా అమ్మ వాదం కూడా ఆ జాతిలోదే.

రంగు రంగుల పువ్వులు, గుత్తులు గుత్తులుగా గుబులో్కని పుష్పించి పోయిన పూల మొక్కలతోనూ; నాజూకైన, సన్న సన్నని, తీపి వాసనలు వ్యాపింపజేస్తున్న చిన్ని చిన్ని పిల్ల వాయువులతోనూ, ఎంతో హాయిగా వుంటుంది– ఒక పార్కు. దాన్లోకి వెళ్లి కాసేపు కూర్చొని వద్దామని ఉబలాటపడతాం. ఆ పార్కు గేటు దగ్గిర అమ్ముతున్న కారప్పు శనగలు కొనుక్కు తింటానికి మనమక్కడికి వెడుతున్నామని

వాదించటం అదేమంత బాగుంటుంది? కారపు శనగ లక్క-డున్నై గనక-అప్పుడప్పుడు మనం కొనుక్కు- తింటే తింటాం కాక, 'కారపు శనగల కోసమే పార్కు-లోకి వెళుతున్నారు' అని వాదించటం హాస్యాస్పదం.

ఒక్కొ-క్క- వ్యక్తి హృదయం అలా నందనోద్యాన వనంలావుండి, సౌరభ్య సౌందర్యాలను ఒలికించుకుంటూ, మానవ హృదయాలను తనలోకి ఆకర్షించుకుంటూ వుంటుంది. మరికొన్ని హృదయాలుంటాయి - పల్లేరు డొంకలూ, గచ్చ పొదలూ, ఈతజీబుల ముళ్లతోపులూనూ; ఇంకా కొన్ని వుంటాయి - తడివూక దాళ్ళూ నిప్పుల కుంపట్లూ!

ఇంకో చిత్రం-సుబ్బలక్ష్మి నా కళ్ళల్లోనుంచి నాహృద యంలోకి తొంగిచూసేది. వెంటనే నా విషయమంతా ఆవిడకు తెలిసి పోయేది. నాకూ అంతేం! ఆ చిరునవ్వులో నాకు స్వర్గ భూముల భోగట్టా అంతా తెలిసేది. ఆ క్రీగంటిచూపుతో మానవ ప్రపంచ విజ్ఞానాన్నంతా 'శక్తిపాత' జేసినట్టు నాలో జ్వలింప జేసేది. ఆ తపస్విని. హృదయంలో వున్న ఆవేశంలో అణుమాత్రమైనా బయటికి చెప్పుకోటానికి చాలని యీ కుంటి మానవ భాష మాకేం చాలేదీ, ఆ రోజుల్లో!

పాలు త్రాగే యీడు బాగా మించిపోయిందని, బలవం తాన పాలు మాన్పించారు. కాని, అదేమిటో నాకు కుతిగానే వుండేది. పాలు నా కక్క-రలేదు, ఆ ఒళ్లో పడుకుని హాయిగా ఒళ్లుమరచి కన్ను మూయ్యనిస్తే చాలు. ఈ అవకాశాన్ని కూడా వాళ్లు అరికట్టడానికి చూస్తున్నారని నాకు, మా అమ్మా వాళ్ల

మీద యెంతైనా ఉక్రోషంగా ఉండేది. దొంగమాటుగా మా అమ్మని తప్పేసుకుని సుబ్బులక్ష్మి దగ్గిరకు చేరుకునేవాణ్ణి. కరుణా వాహినిలా కదలి, ముసిముసి నవ్వుల వెన్నెల తరగల మాలికలతో నన్ను ఆలింగనంలోకి అలుముకుని, గబగబా ఒళ్లోకి తీసుకునేది. "దబ దబా రెండు గుక్కలు తాగెయ్!" అన్నమాటలు నిశ్శబ్దంగా ఆ మాతృహృదయంలోనుంచి సన్నని నా కంఠనాళంలోకి పుక్కిలింతగా ప్రవహించిపోయేవి.

నాకు పాలివ్వటం ఒక పెద్ద గౌరవంగానే భావించుకుని లక్ష్మి గర్వపడేది. ఎందుకనో—? యీ రహస్యంమటుకు నాకు యిప్పటికీ సరిగా అర్థంకాదు. సుబ్బులక్ష్మి హృదయంలో మూలమూలలకు పారాడి ఆడుకునేవాణ్ణి. ఆ ముత్యాల శాలంతా నాకు కొట్టిన పిండే! ఈ ఒక్క రహస్యంమటుకు కనిపించకుండా ఎక్కడో గుప్తంగా దాచి పారేశింది. కొంచెం పెద్దవాణ్ణయాక, ఆ భవనమంతా మళ్ళా ఒకసారి కలియ వెదికి కనుక్కుందామని బయలుదేరితే—ఆ దివ్య భవనంలో వున్న విద్యుద్దీపికలన్నీ ఒకటొకటే 'టప్' 'టప్'న ఆరిపోయి కన్నూ కన్నూ పొడుచుకున్నా కూడా కనిపించకుండా, అంధకార మావరించి అయోమయమై పోయింది.

గౌతమ దేవులకు పాలిచ్చి తనిపిన మహా ప్రజాపతీ దేవికూడా ఇలానే గర్వపడేదని మీరంటే అనొచ్చు. కాని, దీనికీ దానికీ చాలా వ్యత్యాసం ఉంది. ఆ తల్లి అలా గర్వ పడటానికి తగిన బలవత్తరమైన కారణాలు కనుపించుతున్నై.

ఆ మహా శిశువు చక్రవర్తి కాబోతున్నాడనీ, శాక్య సింహాసనానికి ముందెప్పుడో కలగబోయే గౌరవం తన వక్షస్థలం ముందుగానే దక్కించుకుంటున్నదనీ ఆమెకు తెలుసు. అదీగాక ఆ శిశువు జనించగానే పెద్ద పెద్ద జ్యోతిష పండితులంతా వచ్చి, ఈ శిశువు ప్రపంచోద్ధరణ చెయ్యటానికి పుట్టుకొచ్చిన మహాపురుషు డన్నారు.

మరి నా మాటేమిటి? నాకు రాజ్యాలేమీ లేవే! పైగా, నేను పుట్టినప్పుడు యే జ్యోతిష పండితుడూ వచ్చి నేను గొప్ప వాణ్ణవుతానని చెప్పనూ లేదు. నీళ్లాడంగానే మా అమ్మను చూడ్డానికి వచ్చిన ఆవిడ పినతల్లి మాత్రం, పురుట్లో నేను అహోరాత్రులూ కచ్చబట్టి యేడుస్తూ, మా అమ్మకు నిద్రాహారాలు లేకుండా చేసి వేపుకు తింటుంటే విసుక్కుని, "ఎలిక పిల్లల్లే కీచుమంటూ, వెధవ...వీడు బ్రతికి నిన్ను ఉద్ధరించి యేడుస్తాడూ?...పీక నులిపి ఆ పాటిమీద పారెయ్... చెవులు గింగుర్లెత్తు కుంటూ ఒకటే కీచురాయి రొద..." అందిట. ఆ శాపం ఒక్కటి మినహా, నాకు ఇతర మహాదాశీస్సులు కూడా యేమీ ఉన్నట్టు యెనరూ చెప్పరు.

పోనీ, లక్ష్మికి బిడ్డలు లేకపోవడంచేత బిడ్డలంటే మోజందామా?......అలానూ అంటానికి వీలులేదు. ఆ తల్లికి కడిపెడు సంతానం. వాళ్లందరికంటే లక్ష్మి నేనంటేనే యెక్కువ ఆప్యాయంగా చూసేది.

లక్ష్మి బిడ్డలతో నేను ఆడుకునే వాణ్ణి. వాళ్ళేమన్నా కాస్త నన్ను నొప్పించితే, వాళ్ళను వెంటనే మందలించేది.

నేను వాళ్లనేమి చేసినా నన్నేమి అనకపోగా, వాళ్లు 'తల్లి కదా' అని తనతో చెప్పుకోవస్తే-"పాపాయితో పోట్లాడు తున్నారా?" అని ఎదురు తన బిడ్డలనే మందలించుకుని, వచ్చి నన్ను ఎత్తుకుని బుజ్జగించేది. నా దురుసు తనాన్నీ, సు దుర్మార్గాన్నీ, తన కన్న బిడ్డ లెత్తిచూపినా ఆ తల్లి సహించేది కాదు. ఆ మాతృ మూర్తి హృదయంలో నా మీద అంత కరుణ ఏమిటో?!—

ఆ తల్లికి నే నెప్పుడూ యే విధంగానూ సాయపడ లేక పోయాను. నాది అనేక దౌర్భాగ్య జీవితం. నాకు లవలేశ మేదైనా జీవితంలో సుఖశాంతు లిచ్చిన యేవ్యక్తికీ, నా వల్ల చిల్లి గవ్వయినా ప్రత్యుపకారం జరగలేదు - ఇంతో అంతో సంక్షోభం తప్ప. నేనే యేవ్యక్తికి అనవసరంగా కొంచెం చెయ్యి ఆసరా ఇవ్వబోయానో వాడల్లా, నా డొక్కలో ఏదో వక బాకుపోటు పొడిచే తీరాడు.

అసలా దేవమూర్తికి నేను సహాయం చెయ్యటమనేది వట్టి లేకిమాట - వట్టి అపవిత్రమైన భావం కూడా నేమో! ఆ స్త్రీ మూర్తి బానిసకాదు, ఆ యీ మనుష్యుల ముష్టిమీద ఆధారపడి బ్రతకటానికి. తన జీవిత సర్వస్వాన్నీ, తన రెక్కల కష్టంమీద ఆధారపడి నిర్మించి, నిర్వహించుకున్న ధీశాలిని ఆ తల్లి. పొరపాటున, అలాంటిమాట నేను నోరుజారి అనే ఉంటే, నా వంక ఒక ఓరకంటిచూపు చూచి, ఒక్క చిరు నవ్వుతో, నేను వట్టి లేకి మనిషినని చెప్పేసేసేదే - ఏనాడో.

ఒకసారి ఇలానే జరిగిందట. లక్ష్మి నాకు పాలిస్తోందని

ఏదైనా ముట్టజెప్పి చేతులు కడిగేసుకుందామని మా అమ్మ కొంత పైకం ఆమె చేతిలో పెట్టబోయిందట. "ఏమిటది?" అందిట లక్ష్మి. "ఇవి తీసుకో లక్ష్మీ! పసిగ్రుడ్డును బ్రతికించుతున్నావు...ఏమిస్తే మటుకు ఋణం తీరుతుందిగానీ..." అందిట మా అమ్మ. వెంటనే లక్ష్మి, ముఖం కందగడ్డ చేసుకుని "చాల్లెండి!...ఎవరన్నా వింటే నవ్విపోతారు...పసిబిడ్డని, నాలుగు ధారలు పాలచుక్క లిస్తున్నాటా...అందుకనీ కూలిస్తారుట!...చనుబా లమ్ముకుని బ్రతకవలసిన చెడురోజులు కూడా వస్తే అప్పుడిద్దురుగాని లెండి...ఏదో రెక్కల కష్టం చేసుకుని బ్రతుకుతున్నానుగా" అని చాలా చిరాకుపడ్డదిట. ఇంత అల్పకాలంలో, తన దేశంలోనే, కొనుక్కోటానికి కూడా, బర్రెపాలైనా దొరకక, పసిగ్రుడ్లు, లక్షలకు లక్షలు కలకత్తా వీధుల్లో కంకాళాలుగా రాలిపోవలసి వస్తుందని_ఆ తల్లి ఆ నాడు ఊహించుకో గలిగివుంటే, ఆ తల్లి కరుణహృదయం ఎంత కోసుకు పోయేదో!

తన రెక్కల కష్టంమీద తను బ్రతకగలననే ఆత్మవిశ్వాసం, ఆ తేజోమయి హృదయంలో ఒక జ్యోతిలా వెలుగుతూ కనిపించేది. ఎవరైనా ఏదైనా ఊరికే తన చేతిలో ఏదన్నా పెట్టవస్తే, చాలా కంటగించుకుని "ముష్టి వేస్తారా?" అనేది. ఆ జీవితం ఒక అసిధారావ్రతం. ఏపూట కాపూట తన కంచంలోవున్న మెతుకులు తన రక్తంలోనుంచి పుట్టినవా కావా! అని అజ చూసుకునేది, ఆ తల్లి. గంభీరమైన ఆ ఆత్మ

విశ్వాసాన్ని జ్యోతిగా చేసుకుని తన జీవితాన్నంతా తేజో మయం చేసుకుంది ఆ మాతృశ్రీ.

*　　　*　　　*

ఆ రోజు స్వర్ణ సంక్రాంతి. మా యింట్లో బూరెలు వండుకున్నారు. మా అమ్మ నాకు ఒక బూరెముక్క చేతి కిచ్చింది. "సుబ్బలక్ష్మికో మరీ?..." అనిపించింది నా మనసుకు. రెండో చెయ్యి చాచాను. ఆ చేతికికూడ ఇంకొకటి అందించింది. అవి రెండూ తీసుకుని సుబ్బలక్ష్మికోసం దొడ్లోకి వెళ్ళాను. సుబ్బలక్ష్మి వీపుమీద పడుకుని, భుజంమీదుగా చెయ్యి ముందుకు పోనిచ్చి నోటి కందివ్వ బోయాను. లక్ష్మి ఆపి, ఆ ముక్క తీసి చేత్తో పట్టుకుని—

"తినూ" – అంది.

"ఇదిగో నాకూ" అని రెండో బూరెముక్క చూపించాను.

"ఇది కూడా తిను."

"ఊహుఁ..."

"ఏం?..."

"నువ్వు తిను" అన్నట్లు సంజ్ఞ చేశాను.

"వద్దులే...నువ్వే తిను."

"ఊఁ...తినూ..." అని మారాం చేశాను. నోట్లో పెట్టుకోబోయింది. మళ్ళా ఎందుకనో, చటుక్కున ఆగి – కళవళంగా – "అలా నే తినగూడదులే...నువ్వే తిను..."

అని నా చేతి కిచ్చేసింది. నన్ను తృప్తిపరచడానికి, మొదట్లో ఏమీ ఆలోచించకుండా, నోట్లో బెట్టుకో బోయింది. కాని మళ్ళా ఏదో మత్తులోనుంచి మేలుకున్న మనిషిలా, చివాల్న ఆగి, కంగారుగా "కాదులే...అలా నేను, అలా తినగూడదులే" అంటూ ఆ బూరెముక్క నా చేతి కిచ్చేసింది. నా కెందుకో ఏడుపు ముంచుకొచ్చేసింది. రెండు గ్రుడ్లనిండా గిర్రున నీళ్లు తిరిగాయి.

"ఏమిటి నాన్నా!...ఎబ్బే...ఏమిటి?...ఎందుకు?_"

బిగ్గరగా ఏడిచేశాను—

"నాన్నా ! ఊరుకోవూ ?...అలా ఏడవకూడదమ్మా ! ...అలా నేను తినగూడదూ...మా నాన్నగాదూ...అలా నైతే నీ జత ఉండను..." అన్నది.

ఏడుపు మ్రింగేశాను. ముఖం చిట్టిమంత చేసుకుని, ఆ రెండు బూరె ముక్కలు పుచ్చుకుని పడమటింటి గుమ్మం లోకి వచ్చి వాటిని అక్కడ కూర్చున్న మా అమ్మ ముందర గిరవాటు పెట్టాను. బిక్కముఖంబెట్టి, గోళ్లు గిల్లుకుంటూ, ఆ గుమ్మానికి ఆనుకుని నిలుచున్నాను. అదిచూసి, మా అమ్మ.

"ఏం ? దాముడు చాల్లేదా ?" _ అని కసిరింది.

నేను మాట్లాడలేదు ; గోళ్ళు గిల్లుకుంటూ నిలుచున్నాను.

"బెల్లం కొట్టిన రాయిలా మాటకూడా పడిపోయిందేం ?"—

మాట్లాడలేదు...గోళ్లు గిల్లుకుంటున్నాను. ఇంకో బూరెముక్క వాటికి జతచేసి, "ఊఁ! ఈగో!...వెళ్లు..." అంటూ నా చేతిలో బెట్టొచ్చింది. నేను పుచ్చుకోలేదు; రెండు గ్రుడ్లనిండా నీళ్లు తిరిగాయి. మా అమ్మకేమీ అర్థం కాలేదు. "ఏమిటి నాయనా!"...అంటూ ఆదుర్దాగా, దగ్గిరికి తీసుకో బోయింది. బిగ్గిరిగా వెక్కెక్కి ఏడ్చేశాను. అంతా చుట్టూ మూగారు. ఎందుకేడుస్తున్నానో ఎవ్వరికీ తెలియలేదు. 'చీమ కుట్టింద'న్నారు కొందరు. 'తేలేమో' నన్నారు మరికొందరు. 'పిల్లినిజూచి భయపడి వుంటాడు' అని నిర్ధారణ చేశారు ఇంకా తెలివిగల వాళ్లు. అక్కడున్న ఒక మహా యోగి, ఒక్కక్షణం కళ్లు మూసేసి, మళ్ళా తెరిచి, చిటికె వేస్తూ, ఆవులించి...'ఇశ్శో...రంగా!...సరే.నాకంతా తెలిసి పోయింది లెండి; మరేం ఫరవాలేదు...కొంచెం వీభూదీ, సాంబ్రాణీ, ఒక కొబ్బరికాయా, పంచెవన్నెల నూలూ తెప్పిం చండి. ఇప్పుడే పని చేసేద్దాం'—అంటున్నాడు.

ఈ రాద్ధాంతమంతా వింటుంటే నాకు మరింత ఏడుపు ముంచు కొచ్చేస్తుంది. అసలు అదేమిటో నాకు అయోమయ మయి పోతోంది. ఇక ఆ ఏడుపు నా స్వాధీనం తప్పి పోతోంది. ఆపుకుందామని యెంతో ప్రయత్నించాను. ఆపుకో లేక పోయాను.

నేను ఎక్కెక్కి ఏడవటం దొడ్లోకి వినిపించి, సుబ్బ లక్ష్మి నడవాలోకి వచ్చింది. దూరంగా నిల్చుని నా వంక అదోలా—ఒక చూపు చూసింది. దాని అర్థం నాకు తెలుసు.

'నీ వలా ఏడవటం నాకు యిష్టంలేదు- నీవు వెంటనే మాను'-అని ఆ చూపుకు అర్థం. అది నాకు తెలుసు. ఆపుకోవాలని ప్రయత్నించుతూనే వున్నాను. ప్రయత్నించినకొద్దీ, వెల్లువలా దుఃఖం నన్ను ముంచి పారేస్తుంది.

ఆపాదమస్తకం కంపిల్లిపోతూ, ఒణికిపోతున్న గొంతును అలా అలా స్వాధీనానికి తెచ్చుకుని బలవంతాన పైకి పెగుల్చుకుని—

'నాన్నా!'—అని దీనంగా ఆర్చింది.

నిండి తొణికిసలాడుతున్న, అక్కడున్న నీళ్లగంగాళం కంగారై, గజిబిజిగా ఏమిటో కళవళించి పోయింది, అయోమయంగా. 'జివ్వు'మంటూ ఈ దుఃఖ గీతిక ఆ సావడి అంతా వ్యాపించి, 'జిమ్ము' మని ముసురు వేసిపోయి నట్లయింది. ఆ అనాహతరావం ఇప్పటికీ నా రక్తనాళాల్లో మారుమ్రోగుతూనే వుంది.

నా మేథస్సులోవున్న సర్వనాడులూ, స్తంభించి దిమ్మెక్కిపోవటం తప్ప-ఆ ఆర్త సంఘోషణానికి అర్థమేమిటో నాకు అప్పుడిక బోధపడలేదు. ఇప్పుడిప్పుడు ప్రపంచాన్ని అర్థం చేసుకోగా, నా కళ్లయెదుట ఒక శోకమూర్తిగా విచ్చులుకుని కనుపించుతోంది. ఈ దీనారావంలో మానవ హృదయ గుహాకుహరంలో ఘూర్ణిల్లుతున్న ఆ విషాద గాథంతా సెలయేళ్ల శోకనినాదంలాగు నిరంతరం నా రక్తనాళాల్లో మారుమ్రోగుతూ నన్ను కలవర పరుస్తూనే వుంది.

ఆ పిలుపు నాకుకాదు—నాలో యుగయుగాలుగా చివికి చివికి నిర్జీవమై నశించిపోతున్న నా మానవత్వానికే!

ఆ పిలుపు విని, మా అమ్మ ఆ మూర్తివంక దీనంగా చూసి, "సుబ్బలక్ష్మీ!...పిల్లదూ...ఇదేమిటి?" అని బెంబేలు పడ్డది.

"ఏమీ లేదు; కలవర పడకండి; ఇలా ఇవ్వండి."

మా అమ్మ నన్ను సుబ్బలక్ష్మి చేతుల్లోకి అందించింది. నన్ను భుజాన వేసుకుని దొడ్లోకి తీసుకువెడుతూ, 'మీరిలా రండి' అని మా అమ్మను పిలిచి వెంట తీసుకువచ్చింది. సుబ్బ లక్ష్మి పడమటింటి మొత్త చాటుకు వచ్చి ఆగి, నన్ను చూసి, "తింటాను మరి...ఏడవకిక"—అంది. మా అమ్మ వంక తిరిగి—"ఆ బూరెముక్కలిలా తెండి...నాకూ కూడా ఒకటి తెండి" అనేసింది, బలవంతాన పెగుల్చుకుని. నా కోసం ఆ తల్లి తన అభిమాన హృదయాన్ని చివుక్కున రెండుగా చీరుకుంది. ఆ బాధంతా గజగజా ఒణికి కంపిల్లిపోయిన ఆ పెదవుల్లోనుంచి విద్యుత్తరంగంలా దూసుకువచ్చి, నా హృద యానికి కొట్టుకోనే కొట్టుకుంది.

మా అమ్మ లోపలికిపోయి బుట్టా బుట్ట తెచ్చి అక్కడ పడేసి, "ఈగో సుబ్బలక్ష్మీ!...తనకెన్ని కావాలో అన్ని తీసుకోమను"—అంది.

"ఎన్నో అక్కర్లేదు—రెండు చాలు...ఇలా యివ్వండి" అని రెండు ముక్కలు తీసికుని, "ఇదిగో! నేనూ తింటున్నానుగా తీసుకో!...ఏడవకు మరి."

వర్షం చటుక్కున ఆగిపోయి, మబ్బుతునక ప్రక్కకు తప్పుకోగానే, తెరదించినట్టు—చరాల్న నీ రెండ వ్యాపిస్తుంది. కన్నీటి పొరజాలులో మునిగిపోయిన నా కనుకొలకులలో, కాంతి రేఖలు మిలమిలా. బూరె మునిపంట కొరికాను... వెక్కిళ్లు ఒకటొక్కటే తగ్గిపోతున్నాయి.

"ఏదో ఒకటి చెప్పి వాళ్లనందర్నీ అవతలికి పంపించి వెయ్యండి...పిల్లడిచేత మారాం చేయించి ఇంట్లోనుంచి అవీ. యివీ తెప్పించుకు తింటుందనుకుంటారేమో !...సిగ్గు చాట్ల పని" అన్నది సుబ్బలక్ష్మి—అవమానంతో అటుమటించి పోతూ...

# సాహిత్య సమవాకారం

[ఈ నాటికలో ఆయా కవుల పాత్రలు పాడే పాటలూ, పద్యాలూ, గేయాలూ, వచన పదాలూ ఆయా కవుల స్వీయరచనలనుండి స్వీకరించినవే - వారందరికీ కృతజ్ఞత !]

## ప్రథమాంకము

—: నాంది :—

శ్రీకావ్యాత్త రసప్రపీథులు, సిత
శ్రీ స్ఫేష్ఠకాష్ఠాయిత
వ్యాకృత్రాప్తక్తనసామిదేని జ్వలన
వ్యాలోల ధూమచ్ఛటా
చ్ఛేక ప్రాభవ జింఖనీకృత సుర
జ్యేష్ఠాధివాసాధికుల్
బ్రేకుల్ లేని కవీ గవీ ద్వితతికిన్
భీతార్తి కేంర్మోడ్ఛేదన్.

నాంద్యంతమున సూత్రధారుడు గిరీశం ప్రవేశించి :

గిరీ : కవితారంగం కమ్యూనిటీ ప్రాజెక్టు లాంటిది. ఈ ప్రదర్శనంలో వేషం వెయ్యటానికి మాకు అభిమానమున్న వారినే ఆహ్వానించామనీ అసంఖ్యాకంగా వున్న ఆంధ్ర కవి పుంగవుల కందరకూ అవకాశం లేకపోయిందనీ ఏ ఒక్కరూ

బెంబేలు పడక్కర్లేదు. ప్రేక్షక మహాశయులలో ఎవరికి ఎలాంటి ఉబలాటమున్నా పారా పలుగూ లేకుండానే పరాహత్ గా పనిలోకి వచ్చెయ్యవచ్చు – అంటే ఈ రంగం మీదికి ఉరికెయ్యవచ్చు. సందర్భా సందర్భాలతో నిమిత్తం లేకుండా ఔచిత్యానౌచిత్యాల ప్రమేయం అంతకంటే అక్కరలేకుండా, పాటగాని, పద్యంగాని, గీతంగాని, గేయంగాని, వచన పదంగాని, పదవచనంగాని, ఏది బడితే అది–ఎప్పుడు బడితే అప్పుడు చెడుగుడు గూసెయ్యవచ్చు–యోగ్యతా యోగ్యతల ప్రతిబంధకాలేమీ లేవు.

గిరీశం యీ నాటకానికి సూత్రధారుడేవిటని మీలో కొంతమందికి ఉక్రోషంగా వుంటే వుండవచ్చు. రొమాంటిక్ పొయిట్రీతో, బుచ్చమ్మలాంటి విద్యాగంధం లేని విషోను సహితం సంస్కరించి సూత్రధారణచేసిన మహాకవిని నేను సూత్రధారి కాకుండా ఈ ప్రదర్శనం రంజించదని మన వాళ్లంతా యిదౌతుంటే సరేనని, ఈ కార్యభారాన్ని నెత్తిన వేసుకున్నాను; యిందుకు క్షంతవ్యుణ్ణి.

భారతజాతి ఉద్ధరణకు అటు మహాత్ముడు రాజకీయ మహోద్యమాన్ని సాగించినట్లే, ఆంధ్రజాతిని ఉద్ధరించటానికి నవ్యాంధ్ర మహాకవులు సాహిత్య మహావిప్లవాన్ని దూకించి మన కంఠాలు తెగిపోకుండా కాపాడి రక్షించిన సంగతి మీ కందరికీ తెలుసు——కొందరికి తెలియకపోయినా యిప్పుడు నేను చెబుతున్నాను గనుక తెలుసుకోవచ్చు. ఆ మహా కవు లందరూ నవ్యాంధ్ర సాహిత్య రంగంలో శాఖోపశాఖలుగా

వెల్లి వెరియజేసిన విప్లవ పరంపరల పుణ్యకథనం తమముందు ఇప్పుడు ఈ నాటకరూపంలో ప్రదర్శించే అవకాశం మాకు కలిగినందుకు మమ్మల్ని మేము అభినందించుకుంటున్నాం.

ప్రణయ విప్లవ మహోకవనానికి ప్రాతిపదికగా అస్మద్వి రచితమైన ఒక ఖండా ఖండ మహాకావ్యాన్ని మాయా మాళవగౌళ రాగంలో మనవి చేసుకుంటాను—

నీలాలలోనున్న నియమంబు తీసి
బంగారులోనున్న పాలను తీసి
మేల్మి పన్నీటిలో మీగడల్ తీసి
నీహారగిరిలోని నీతిని తీసి
కృష్ణవేణమ్మలో కీర్తిని తీసి
ఎండమావులలోని యింపును తీసి...

[శ్రీ కొల్లూరి ధర్మారాయకవిగారి 'చాకి రేవు'నుండి.]

[వెంకటేశం ప్రవేశం]

వెంక : తెలివితక్కువలోని విలువను తీసి—

గిరీ : అరె నీ యిల్లు బంగారంగానూ! సమయానికి యెక్కణ్ణుంచి ఊడిపడ్డావ్ మైడియర్ షేక్స్పియర్?

వెంక: ఏమిటి బావా, ఏదో నాటకం ఆడుతున్నారట?

గిరీ : ఏదో నాటకమని నిమ్మళంగా అంటున్నా వేమిటోయ్! విశ్వశ్రేయ సంధానకర్తలు, ఆబాలగోపాల సకలాంధ్ర ప్రజాసమ్యగుద్ధారకులు, గణ గణాయమాన కళ పెళ క్కావ్య రణరణాయమానులు.

వెంక : ఆరి నీ సమాసాలు చట్టుబండలు కానూ, అసలు సంగతేదో శాస్త్ర తెలిసేట్టు చెప్పనయ్యా!

గిరీ : అయిన, నవ్యాంధ్ర మహాకవుల దివ్య చరితాన్ని రూపకంగా ప్రదర్శించతున్నాం.

వెంక : అవునుగానీ, ఈ నాటకానికి సంధి లక్షణాలన్నీ సక్రమంగా ఉన్నాయో లేవో కనుక్కు రమ్మంది అక్కయ్య. లక్షణయుక్తం కాని నాటకం చూస్తే రౌరవాదినరకాలకు పోతారు గనక, ఆ సంగతేదో తేలంది ససేమిరా గడప కదల నంటోంది.

గిరీ : ఆరి నీ బొడ్డు పొక్కా! పీకెమీదికే తెచ్చావ్– అకటావికటపు ఛాందసపు మనుష్షులచేత అలంకార శాస్త్రాలు చదివించొద్దురా అంటే నీ కిదేం పొయ్యేకాలం?

వెంక: ఆటస్సా లేమీ రంజించవ్; సంధులూ–సంధ్యాంగాలూ సక్రమంగా లేకపోతే ససేమిరా రానని మొరాయించిం దనుకో—

గిరీ : వాటి శిఖా కోసిరి సంధులు–యింతవాణ్ణి నేను నాటకమాడిస్తుంటే సంధిలక్షణాలు లెక్కేమిటి? ముందు సీను వెనక్కూ, వెనుక సీను ముందుకూ కొంచెం రీ ఎడిట్ చేసి ఆడిస్తే–భడవాసంధులు వాటంతటి కవి ఊడిపడతాయి. ఆ తంటాలన్నీ నేను చూసుకుంటాను; పోయి త్వరగా మీ అక్కయ్యను కేకేసుకురా. [వెంకటేశం నిష్క్రమణం]

భరతశాస్త్రరీత్యా ప్రదర్శించవలసిన ప్రమాదం ఒకటి వచ్చిపడ్డది గనక భాతాఖానీకి ఎక్కువ అవకాశం కనిపించటం

లేదు. అదుగో పార్కర్ ఫౌంటెన్ బాకుతో పరవళ్లు త్రొక్కుకున్నా రప్పుడే కవి సామ్రాట్! ఇతి బీజం. (నిష్క్రమణ)

తెరలేవగా—పార్కర్ ఫౌంటెన్ పెన్ బాకులా పట్టుకుని విశ్వనాథ సత్యనారాయణగారు ప్రవేశించి :—

అతిమనోబుద్ధ్యహంకృతు లౌపనిషదు
లాత్తగందూషితత్రయు లౌర్యవహ్ని
గర్భితాంత స్తపస్కులు ఘనులు ఋషుల
కెవ్వడు విరోధి తద్వ్యధ కెత్తిన యది! (నిష్క్రమణం)

ఆకుపచ్చ టపేటా శిల్కు లాగూ, ఎర్ర టపేటా బుష్ కోటూ తొడుక్కుని, ఎర్రజండా పుచ్చుకుని తాండవం చేస్తూ శ్రీ శ్రీ ప్రవేశించి :—

శ్రీ శ్రీ :

ఝూ! ఝూ! ఝూ!
ఝుటక్ పటక్
ఝూ! ఝూ! ఝూ!

హింసన చణ
ధ్వంసన చణ
హింస రచన

ఝూ! ఝూ! ఝూ!
విషవాయువు మరఫిరంగి
టార్పిడో, టార్నడో

అది విలయం
అది సమరం
అటో యిటో తెగిపోతుంది
సంరంభం
సంక్షోభం
సమ్మర్దన సంఘర్షణా
ఝటక్ పటక్
ఝా! ఝా! ఝా!

... ... ...

మరో ప్రపంచం
మరో ప్రపంచం

... ... ... ...

అగ్ని కిరీటపు ధగధగలు
ఎర్ర బావుటా నిగనిగలు

... ... ... ...

Charlie Chaplin, Joseph Stalin
Walt Disney, George Hugnet
Greta Garbo, Pirandello
ఇటీవల మా Inspiration
Sigmund Freud, Harold Lloyd
Aldert Einstein, Jocob Epstein
హారీన్ చట్టో, గి. రాం. మూర్తి
ఇటీవల మా Inspiration.

కథాకళీ, కూచిపూడీ,
జావా నాట్యం, Russian Ballot
Jazz, Rumba, Carioca
హుషారి స్తయ్, నిషాచే స్తయ్
Don Bradman, Mohan Bagan
Walter Lindrum, Vines, Codhet
కొంచెం Carroms, కాస్త Ping pong
ఒక కప్ కాఫీ, ఒక పఫ్ Cigarette
...  ...  ...  ...
మరో ప్రపంచం
మరో ప్రపంచం
మరో ప్రపంచం
ఝా! ఝా! ఝా!
హింసన చణ
ధ్వంసన చణ
హింస రచన
ఝా! ఝా! ఝా!
ఝుటక్ పటక్
ఝా! ఝా! ఝా!

[గంతులు వేసి వేసి అలిసిపోయి అక్కడవున్న ఒక కుంటికాలి బెంచీమీద కూర్చుని, పడిపోకుండా బ్యాలెన్సు నిలుపుతూ సిగరెట్టు ముట్టిస్తాడు.]

నేపథ్యంలో బొంగురు గొంతుతో పఠాభి:—

నా యీ వచన పదాలనే దుడ్డు కఱ్ఱతో
పద్యాల నడుముల్ విరగతంతాన్ !—

శ్రీ శ్రీ [ఆవేశంతో బెంచీమీదనుంచి లేచి, బెంచీతో పాటు క్రిందపడి అదే పోజులో]

అర్థాన్ని ఆధ్వాన్నపు అడవిలో వదిలి
గద్యాన్ని పద్యానికి పెళ్ళి చేద్దాం—
కాదన్న మాదన్న మొనడేనా వుంటే
వేమన్న యేమన్నాడో చూడమందాం.

నేపథ్యంలో పఠాభి:

చిన్నయ సూరి బాలవ్యాకరణాన్ని...

శ్రీ శ్రీ: ఆ పాపు సీదుడ్డుకఱ్ఱ !—

చిత్తు చిత్తుగా
చితకేస్తాం—
ఛందో బందోబస్తులన్నీ
ఛట్ పట్‌మని త్రెంచి
Dammit ఏమిట్రా యిదంటే
Pray it is Poetry అందాం.

నేపథ్యంలో పఠాభి:

ఇంగ్లీషు భాషా భాండారంలోనుంచి
బందిపోటుం జేసి కావాల్సిన
మాటల్ను దోస్తాను

నా యిష్టం వచ్చినట్టు చేస్తాను
అనుసరిస్తాను నవీనపంథా—కాని
భావకవిని మాత్రం కాన్నే
నహం భావకవిని

["భళీ భళీ త్వమేవాహం" అంటూ ఆరుద్ర ప్రవేశం]

ఆరుద్ర :

ఆ ఇ ఉణ్ బుక్ ఇక్
అందమే పశుకుభుక్
క ఖ గ ఘ ఙ
చావుకి అనుజ్ఞ—
ఆకలేమన శుక్ర—
అందమైన బ్ర—
కొంత మెతుకుతో
నిండుతుంది స్త్రీ—
కడుపునిండు మె—
కొంత బ్రతుకులో
దొరుకుతుంది లే—

[మస్తిష్కం లేబొరేటరీమీద శాంతి పావురాయిల నెక్కించుకుని దాశరథి ప్రవేశం]

దాశరథి :

నా వేదనలో జన్మించిన ఊహింపులు
తొడగటానికి వ్యాకరణ సూత్రపు

రెడీమేడ్ దుస్తులు లేక
దిసమొలల్తో ఉరుకుతున్నాయి
లోకాన పడి!

[ఈ యిద్దర్నీ చూసేటప్పటికి శ్రీ శ్రీకి తిరిగి ఆవేశం వచ్చేస్తుంది.]

శ్రీ శ్రీ :—హారోం! హరోం హర!
హర! హర! హర! హర!
హర హర హర హర!
హరోం హరా!
మరో ప్రపంచం
మరో ప్రపంచం

[తక్కిన యిద్దరూ కూడా అందుకుంటారు. ముగ్గురూ కవాతుగా నడుస్తారు.]

పదండి ముందుకు
పదండి త్రోసుకు
... ... ...
కదం త్రొక్కుతూ
పదం పాడుతూ
హృదంతరాళం గర్జిస్తూ
పదండి పోదాం
వినపడ లేదా
మరో ప్రపంచపు జలపాతం

మరో ప్రపంచం
మరో ప్రపంచం
...      ...      ...

కనబడలేదా మరో ప్రపంచపు
అగ్ని కిరీటపు ధగ ధగలూ
ఎర్ర బావుటా నిగ నిగలూ!

[నిష్క్రమణ]

[వెనుకనున్న తెర నెమ్మదిగా లేస్తుంది. బందరు రాబర్ట్సన్ పేట కుండుదగ్గిర కూరల మార్కెట్ చేరువులో ఒక గొడుగుల దుకాణం! గొడుగుల దుకాణమంటే, గొడుగులమ్మే దుకాణం కాదు; తాటాకు గొడుగుల క్రింద పెట్టివున్న 'కవితా సామగ్రి' దుకాణం. దుకాణంమీద చుట్ట గాల్చుకుంటూ కాటూరి వెంకటేశ్వరరావుగారు కూర్చునుంటారు, ప్రక్కనే పింగళి లక్ష్మీకాంతంగారు జొన్నకంకులు పుచ్చుకు కూర్చుని వ్యాచబిష్యం కొడుతూ వుంటారు. దుకాణం దగ్గిర ఆడా మగా చాలామంది మూగి, అక్కడున్న సరుకులన్నిటినీ వింతగా చూస్తూ వుంటారు.]

వేంక :

చూతురా దీనినిఁ, జూతపల్లవ ఖాదిని
పికాంగనా గాన నిస్వనంబు
కొందురా? దీనిని, క్రొమ్మెఱుంగుల జిల్గు
పనికిఁ గాదగిన కుందనపుఁ దళ్కు

కావలెనా యిద్ది. కలున పూరేకు
    పొత్తములఁ జిప్పిలెడు మొత్తందనంబు
వలయునా? మలయపర్వత సానువులనుండి
    దిగుమతియగు కమ్మతెమ్మెర లివి
తీయుదుర? దీని వెన్నెల తేటసగ్గు
ఒఱియుదుర? దీని బచ్చకప్పురపుదావి
కోఁకొందురా? దీని పటీరజలము
త్రావిచూతురా దియ్యని పూవుదేనె?
నికరమ్మెు అకలంకమైన సరకుల్
    సిద్ధప్రమముల్ మీా పరీ
క్షకు దాళంగల మేల్రకొందినుసు మీా
    కన్గప్పు మోసంపు వ
ర్తకుడన్ గాను, కులక్రమాగతము చే
    రమ్మిద్ది భాషా కుమా
రకులారా! కొనరండు మీారు కవితా
    రంభ ప్రియం భావుకుల్.

వేంక:

ఈనాటిదా మాకు బానయ్య మా మూల
పురుషుండు యజ్ఞాకీ సరకులమ్మె

లక్ష్మి:

ముత్తన్నసెట్టి మా ముత్తాత పింగళి
వారింట తననాడు వతనకాడు

వేంక :

కన్నయ్య మా తాతకాలాన చేమకూ
రవేంకన్న మా కొట్టు బేరగాడు

లక్ష్మి :

ధవళేశ్వరమున మా తండ్రి యంగడిమీద
తిరుపతి కవులు నీ సరకె కొనిరి.

ఒక కుర్రాడు :

కోటయ్య మామ ఈ కుండు దగ్గరె గదా
లేత లేతవి కోసి గోతమెత్తు

వేంక :

నమ్మకమ్మైన యీ సరకమ్ముచుందు
నాంధ్ర దేశమ్ము నలు దిక్కులందు దిరిగి
వతనుగా వత్తునే నసువత్సరమ్ము
నొకపరి కొనుండు మాట నమ్మకము దెలియు.

ఎదురుగా వున్న గోంగూర దుకాణంవాడు :

కొత్తగా బేరవెందుకు సత్తెమయ్య
మెరకసేలోన పెంచిన కరుకుకూర
ఉడకదనమాక, లేహమై ఊరుకుంట
దమగు రేపొచ్చి! పోసుకోలాణ్ణిగాను!

[గడ్డితట్టలో గ్రాస్ గరల్ ఒకతె వచ్చి దుకాణం ముందు తట్ట దింపుకుని లక్ష్మీకాంతంగారితో] ఇదిగో! యావు వొ్య్యా!

ఈ యాగానీ ఊచబియ్య వెట్టు—ఓరి నీ యిల్లు బంగారం గానూ ? తంపటన్నా మెయ్యకుండా పచ్చిగింజలే అమ్ము తుండావేం మాయదారి యాపారం !

లక్ష్మి :

పచ్చజొన్నలు తీయని పాలుగారు
లేతగింజలు తినుము—కాలిచిన వింత
తీపియుండదు—

[గ్రా. క : పచ్చి య్యో మెచ్చియ్యో—తొరగా యిత్తావా పొమ్మన్నావా ?—మాటలు జెప్పడవేగాని మడిసి కెక్కడా కరుకులేదేం!

లక్ష్మి :

—తట్ట నెత్తెద విదేల
నూగుపోన నూదెడి దాకనాగలేవ ?

ఒక కుర్రాడు : (వెనకనుంచి యీలవేసి)

జొన్నసేనుకాడ సొగసు కత్తెను నూసి
నిన్నటేలనుంచి నిదరలేదు
దాని నన్నుగూర్చి దయజూడు మాధవా
పొన్నపూలు దెచ్చి పూజసేతు.

[లక్ష్మికాంతంగారు తెల్లబోతారు; ఆ పడుచు వళ్లు మండి 'ఓరి నీ జిమ్మలాగా ! నీకేం పొయ్యేకాలం' అని కుర్రాణ్ణి తిడుతుంది.]

కుర్రాడు :

* జొన్న సేను కవిత్వమే సుందరాంగి
కొత్తసోకుల పోకిళ్లు కులుకులాడి
డొంకసేలోన వెంకి నీరంకె యింటి
పచ్చగడ్డిలో నీమేని పసలుఁగంటి.

[గ్రాస్‌గరల్ తట్ట బుచ్చుకుని కుర్రాణ్ణి వెంటబడి తరుముఁతుంది :]

మరొకావిడ : (జంగిడంలోనుంచి ఒక వస్తువుతీసి) ఈ యినపబల్లు లేవిఁటబ్బాయ్? హెయిరు పిన్నులా?

వేంక : హెయిరు పిన్నులు కావు మకరికా పత్రాలు.

ఆవిడ : మకరికాపత్రా లేవిఁటబ్బీ? ఎందుకిప్వే!

ఒక కుర్రాడు : పాపం, మీారెప్పుడూ వీధి భాగోతం చూాళ్ళేదల్లేవుంది.

వేంక : ఏడిచావ్, నోరుముయ్యి!

ఆవిడ : అయ్యో పాపం, ఆ కుర్రాణ్ణి తిడతావేం? తెలియఁకడిగాను గనుక చెబుతున్నాడు—ఇంతలోకే అంతకోప మేవిఁటబ్బీ?

వేంక : అందంకోసం ఆడవాళ్లు వీటిని బుగ్గల మీాద అంటించుకుంటారు.

ఆవిడ : ఛీ ఛీ! నేనేం అలాంటి పోకిరీ వేషాలు వేసే ఆడదాన్ననుకున్నావా యేవిఁటి? ఫేసుపౌడరు డబ్బావుంటే యియ్యి.

---

* ఒక పాతపద్యం : రచయిత పేరు తెలీదు.

లక్ష్మి : ఛీ! ఛీ! ఛీ! సంప్రదాయమా చట్టుబండలా!

వేంక : (చిరాగ్గా కొట్టుమీదనుంచి లేచి అక్కడున్న జనాన్నందర్నీ వెనక్కి పడదోస్తూ:)

కవితా లతాంగికి కర్ణభూషణమైన
కలున మీచేబడి నలిగిపోవు
మీ కృతికన్యలకీ కుందనపుదళ్ళు
నగలుకై సేయు భాగ్యమ్ము కలదె
యీవలిగాడ్పు మిమ్మానపిహించిన తన
జ్వాల లీనునెగాని సౌఖ్య మిడదు
తీయని యీ గండు కోయిల గానంబు
వెగటాయె నౌర మీ వీనుగవకు

ఈ తుషారజలంబు మీ చేతులంటి
మలినమైపోయె కొనకున్న మానెపొండు
సుకవి భోజ్యమ్ములిచటి వస్తువులు వీని
నలిపివేయకుడటు నిటు గలచివైచి—

కుర్రాడు : 'సుకవి భోజ్యా' లేవిటండీ, చుట్ట పీకెలా!

[వేంకటేశ్వరరావుగారు అమాంతం అగ్గిరాముడై తాటాకుగొడుగు పీకేసి, గొడుగుకామ పుచ్చుకుని కుర్రాడి వెంటబడి తరుముకుపోతారు. లక్ష్మీకాంతంగారు చెల్లాచెదరైన సరకులన్నీ జంగిడాల్లో సర్దుకుని నెత్తిన బెట్టుకు బయలు దేరతారు.]

లక్ష్మి : ఛీ ఛీ! వట్టి చవిటిపర్ర—లాభం లేదు—

ఇక్కడనుంచి అటు యే విశాఖపట్నానికో ఇక దుకాణ మెత్తెయ్యాలిసిందే. (నిష్క్రమణం)

[మద్దెల, హార్మోనియం, తాళాలూ—భజనచేస్తూ ఒక తండా అభ్యుదయ రచయితల ప్రవేశం :]

* కీలుగుఱ్ఱము పైని
బాలీసు కానుకొని
ప్రాణాలు లేనట్టి
భగవంతు డొచ్చాడు
ఊరంత ఊరేగుతూ
ఉత్సవము సాగించుతూ
కూలిమా టడగండిరా
అన్నాలు
చాలవని చెప్పండిరా!
కంచుగుండెకు గూడ
కనికరము గలదన్న
మాయ వేదాంతాల
మాటేదో సూదారి
జాలిగిలబడి మ్రొక్కరా
వినకుంటె
చెవిటిమొద్దని వీడరా
ముక్కోటి దేవతలు
మూర్తుల్లు కంపిల్ల

---

* ఒకానొక అభ్యుదయకవి రచన.

కోటి చేతులు చాచి
గగ్గోలుగా లేచి
కూలిమా టడగండిరా
అన్నాలు
చాలవని చెప్పండిరా !

[నేపథ్యంలో విశ్వనాథ సత్యనారాయణగారు]

అతి మనోబుద్ధ్యహం కృతు లాపనిషదు
లాత్త గండూషితత్రయు లార్వనహ్ని
గర్భితాంత స్తపస్కులు ఘనులు ఋషుల
కెవ్వడు విరోధి తద్వధకెత్తిన యది!

[అభ్యుదయ భజనపరులు తాళాలూ మద్దెళ్ళూ ఎక్కడి వక్కడ రోడ్డుమీద పారేసి తలోత్రోవనూ పరారీ. సత్యనారాయణగారు ప్రవేశం.]

సత్య :

అల నన్నయకు లేదు తిక్కనకు లే
దాభాగ్య మస్మాదృశుం
డలఘుస్వాదు రసావతార ధిషణా
హంకార సంభార దో
హల బ్రాహ్మీమయమూర్తి శిష్యుడయినా
డన్నట్టి దావ్యోమ పే
శల చాంద్రీమృదుకీర్తి చెళ్ళ పిళ్ళ వం
శస్వామి కున్నట్లుగన్.

[రెండవవైపునుంచి జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి-వరఫ్ పారడీశాస్త్రి-ప్రవేశించి, ప్రాంజలిబద్ధుడై మోకరిలి]

జ. రు : కించిత్తిక్త కషాయపాడబరస
    క్షేపాతి రేకాతి వా
  క్సంచార ప్రచయావకాశములలో
    కవ్యృష్య ! గండాశ్మముల్
  చంచల్లల నుదాత్తవాగ్గరిమతో
    సాధించి వేధించుమా
  పంచారించి ప్రవస్లా కాకృతికృతిన్
    పాషాణపాక ప్రభూ !

[తెర దిగిపోతుంది-సొరకాయ బుర్రయేకతార తంబురా మీటుతూ తెరముందుకు కవికొండల వెంకటరావుగారి ప్రవేశం] తత్వాలు :

'దాక్కొని వుంటాయి
దారంటగడ్డి, ని
రుక్కొని వుంటాయి:—
తలపగరాని పూలు
పిలవగబోని పూలు
నిలుపగలేని పూలు
దాక్కొని వుంటాయి,
దారంటగడ్డి, ని
రుక్కొని వుంటాయి !—
గ్రుక్కెడు వాసనీళ్ళకు

పక్కన నవ్వుతాయి
ఉక్కగ కాసంతుంటే
త్రొక్కట పడతాయి
దాక్కొని వుంటాయి
దారంట గడ్డి, ని
ఱుక్కని వుంటాయి——
ఒక్కడ నడుస్తూవుంటే
చుక్కలు పొడుస్తూ వుంటే
మక్కువ గూర్చొమంటాయి
ఎక్కడో ఎందుకో చెప్పవ్
దాక్కొని వుంటాయి'——

[వెంకటరావుగారు నిష్క్రమించగా, కాశీ కావడి బుజాన బెట్టుకుని రెండోవేపునుంచి పింగళి లక్ష్మీకాంతంగారు ప్రవేశించి]

లక్ష్మీ : స్థానము మోక్షలక్ష్మికి, ని
ధానము ధర్మమహాత్మకున్, దిరో
ధానము మందబుద్ధికి, వి
ధానము మానసతృప్తికిన్, సమా
ధానము మేధకున్, సుపరి
ధానము ధాత్రివధూటికిన్. మహో
ధానము శ్రీకి, నీ తనువు
తాపహారంబగు నాకు జాహ్నవీ!

[సీళ్ళు చేసిన కొన్ని రాగి బుడ్డిచెంబులు కావిడి బుట్టలోనుంచి బయిటికి తీసి]

*ఇదిగిదిగో గంగాజలమండో రామాహరీ!
బురాస్ చెరువు నీళ్ళు కాదండో రామాహరీ!
గంగాధరుడి జటాజూటంనుంచి రామాహరీ!
లవంగీప్రియుడు పిండినరసం రామాహరీ!
ఖరార్చైబుడి చెంబుల్లో రామాహరీ!
శిఖా చేయించి తెచ్చామండో రామాహరీ!
తఖరారుందని అనుమానముంటే రామాహరీ!
తాతంభట్టు నీళ్లు తనిఖి చేయించండి రామాహరీ!

(నిష్క్రమణం)

# ద్వితీయాంకము

[గిరీశం ప్రవేశం]

గిరీశం: రానున్నది ఆంధ్ర ప్రజల మహోద్ధరణకుగాను భావకవులచే సారించబడిన మహాద్భుత విప్లవ ఘట్టం. అటు గాంధీజీ ప్రారంభించిన స్వాతంత్ర్య మహా విప్లవానికి మద్దతుగా ఆంధ్ర మహాకవులు లేవదీసిన మహా విప్లవం.

[వెంకటేశం ప్రవేశం]

వెంక: విప్లవం విప్లవమంటున్నా వేమిటి బావా, కాని సీటు రామయ్య గడపదగ్గిర కళ్లురుముతున్నాడు-కాస్త గొంతు తగ్గించు.

* సులక్షణసారం రచించిన లాక్షణీకుడు.

గిరీశం : ఆరి వెఱ్ఱివాడా! విప్లవమంటే – కత్తులూ, కటార్లూ, సత్యాగ్రహాలూ, చుట్టుబండలూ – అలాంటి నాటు రకం రాజకీయ విప్లవ మనుకుంటున్నావా యేవిఁటి? ఇది సాహిత్య విప్లవం.

వెంక : విప్లవం అంటే ఎవరిమీద? ఎందుకు?

గిరీశం : ఎందుకు ఎవఁరిమీదా అనటానికి ఇది రాజకీయ విప్లవం కాదురా బాబూ అంటే వినవేం? ఇది సాహిత్య విప్లవం. విప్లవం కోసమే విప్లవం. కళ కోసమే కళ; ఇది ప్రణయోజ్జ్వల మహా విప్లవం. ఈ మహోద్యమానికి, ధ్వన్యాలోకానికి పోటీగా రమ్యాలోకం రచించి ఆనంద వర్ధనాచార్యులను చిత్తుకింద ఉతికేసిన ఆచార్య రాయప్రోలు అధ్యతన సూత్రకారుడు, ఆ పైని భాష్యకారుడు గిరీశం.

ఆచార్య శ్రీపాదులు అంబరతలాన ఆవిర్భవించి ప్రణయ మహాసూత్రాన్ని ప్రవచించబోతున్నారు కామోష్!

(చప్పట్లుకొట్టి ఈలవేస్తాడు—లైట్లు ఆరిపోతాయి—తెరమీాద గుండ్రంగా వెలుగు చక్రం విచ్చులు కుంటుంది. వెలుగు చక్రానికి మధ్య చిన్ముద్రతో (శ్రీ) రాయప్రోలు సుబ్బారావుగారు_)

మాధు లిచ్ఛయించెదరు సంభోగ సుఖము
నే వియోగ మాధుర్య లీలావిపాక
మనుభవింప నభ్యాశెద!

[గిరీశం గఁయ్యిమని యీాల వూదుతాడు; సుబ్బారావుగారు అదృశ్యమైపోతారు; లైట్లు వెల్గుతాయి.]

గిరీశం : 'సంభోగంలేని సంయోగం'-ది గ్రేట్ ప్లాటా నిక్ లౌ!—(ఈల వేసి చప్పట్లు కొడుతూ) కొట్టెయ్యండి చప్పట్లు! (ఎవ్వరూ కొట్టరు) పోనీ బద్ధకంగా వుంటే మానెయ్యండి.

వెంక : సంభోగంలేని సంయోగ మేమిటి నా తల కాయి 'విరహం రసైక స్థాన' మన్నదాని కొచ్చిన గాడిద గత్తరువా?

గిరీ : అబ్బాయీ, యివన్నీ సీమవాళ్ళ సంగతులు—నీకు తెలీవుగాని యిక ఊరుకో. ఆధునాతన రససిద్ధాంతం నీ కెలా అర్థమౌతుంది యింగ్లీషు చదువుకోంది.

వెంక : ఇదుగో! బావా! మర్యాదగా చెబుతున్నాను. ఆట్ట, కళా అలాంటి డచ్చీ లేవో చదవండిగాని రసం గిసం అన్నారంటే మాత్రం...

గిరీశం : ఆగి పిడుగా! ఆ గోదాలోకొస్తే మోదేస్తా నంటావ్!—ఇంతకీ మరి ఈ ప్రదర్శనం కొనసాగించడమా మానెయ్యడమా?

వెంక : ఇందాకా వొచ్చి ఆపేయ్యడమెందుకు లైట్లు దండగ—కానీ...

గిరీశం : (ముందుకువచ్చి) సోదర సోదరీమణులారా! ప్రణయ మహావిప్లవం ప్రారంభమౌతోంది. ప్రణయమే దుఃఖం, దుఃఖమే అంధకారం: అదుగో అంధకార మావరిస్తోంది!

(ఈలేస్తాడు—లైట్లు ఆరిపోతాయి—మళ్లా యీాల వేస్తాడు. రంగంమీాదికి బ్లూలైట్ ఫోకస్.)

గిరీశం : (అంధకారంలో అరుపు) అంధకారం ఆవరించి పోయింది; రంగంమీాద బ్లూలైటు పడుతున్నా ప్రేక్షకులు కాళ రాత్రిగా ఊహించాలి! (నిష్క్రమణం)

ముళ్ళకిరీటం బెట్టుకుని శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి ప్రవేశం :

కృష్ణ :

ఎవ్వరని యెంతురో నన్ను ఏ ననంత
శోక భీకర తిమిర లోకైక పతిని
కంటక కిరీటధారినై, కాళరాత్రి
మధ్యవేళల జీమూత మందిరంపు
గోలువు కూటాల నేకాంత గోష్ఠి దీర్చి
దారుణ దివాంధరోదన ధ్వనుల శ్రుతుల
బొంగి యుప్పొంగి యుప్పొంగి పొరలిపోవు
నా విలాప నిబిడ గీతికావళీ వి
రావముల నర్ధరాత్రి గర్భమ్ము మరియు
మరియు భీషణకాళిమోన్మత్తగాగ
జేయుతరి నన్ను మీారు వీక్షింపలేదా!...
నన్నుగని యేరు జాలి జెందంగవలదు
నాకు నిశ్వాస తాళవృంతములు గలవు
నా కమూల్య మపూర్వ మానంద మొసగు

నిరుపమ నిశాంత దుఃఖంపునిధులు కలవు—
ఎవ్వరని ఎంతురో నన్ను?—

*　　　*　　　*

మీరు మనసారగా నేహ్వనీరు నన్ను—
నన్ను విడువుడు—ఒకసారి నన్ను విడిచి
నంత నేకాంత యవనికాభ్యంతరమున
వెక్కి-వెక్కి- రోదింతును విసువు లేక
విరతిలేని దుర్భరశోక విషమగీతు
లేడ్చివైతును!—

*　　　*　　　*

ప్రేయసీ ప్రేయసీ
ప్రియుడనే ప్రేయసీ
వేయికన్నులు దాల్చి
వెదకుచున్నానే
నల్ల మేఘాలలో
నాయమా దాగంగ?
తల్లడిలవో నన్ను
దలచి రావో!
మెఱుపువై యొయ్యారి
మెఱుపువై కాన్పించి
యరసినంతనె
మబ్బుతెరల దాగితివా

ప్రీయసీ! ప్రేయసీ!
ప్రేయసీ! ప్రేయసీ! (నిష్క్రమణం)

(వెంకటేశం ప్రవేశం)

వెంక: (తెరలోకి చూపి) ఆర్! ఏవిఁటి చెపుమా అల్లా గుండెలు కొట్టుకుని గోలబెట్టేస్తున్నారు! (వెనక్కి తిరిగి చప్పట్లు గొట్టి) బావోయ్! బావోయ్!

(గిరీశం ప్రవేశం)

గిరీ: ఏవిటలా గావుకేక లెట్టేస్తున్నావ్?

వెంక: నెత్తుకుపోలా!

గిరీ: నెత్తుకుపోలా ఏవిటి నీ తలకాయ్!

వెంక: నెత్తుకుపోలాయే తెలీదూ? నిక్కబోతావ్ మహా యింగ్లీషు చదివాననీ! ఎలా గుండెలు బాదుకుంటున్నారో అటుచూడు!

గిరీశం: అది సాయబుల ఊరేగింపు కాదురా బాబూ, సత్కవుల సమాజగానం! నీకు సంస్కృత సమాసంలో చెప్పే డిస్తేనేగాని అర్థంకాదు. విరహావేదనా దోధూయమాన మానసులైన భావకవులు—in Community—అంటే ఏకైక బృందంగా విలపించుచున్నారు. రంగం మీద లైట్లు ఆఫ్ చెయ్యాలి—లోపలికి పోదాం పద. (లాక్కుపోతాడు.)

[లైట్లు ఆరిపోతాయి. బ్లూలైటు ఫోకస్. గుండెలు గభీ గభీ గుద్దుకుంటూ ఒక తండా భావకవుల ప్రవేశం]

ప్రేయసీ! ప్రేయసీ!
ప్రేయసీ! ప్రేయసీ

ప్రేయసీ! ప్రేయసీ
ప్రేయసీ! ప్రేయసీ

[రంగమధ్యకు వచ్చి నిల్చుని పాట ఆపేసి ఒక లయలో జబ్ జబ్ గుండెలు బాదుకుంటారు. గుండెలమీద చొక్కాలు చిరిగిపోతాయి. ఎదుర్రొమ్ములు ప్రిదులుకుపోయి రక్తాలోడుతూ వుంటాయి. 'ప్రేయసీ! ప్రేయసీ' అంటూ మళ్ళీ పాట అందుకుని గుండెలు మోదుకుంటూ ఊరేగింపుగా కదిలి లోపలికి వెళ్ళిపోతారు.

[రెండవ వేపునుంచి పార్కర్ పెన్ బాకుతో విశ్వనాథ సత్యనారాయణగారి ప్రవేశం.]

సత్య: ఆత్మ నిత్య మ్మకాలాద్యనచ్ఛిన్నమ్ము
సచ్చిదానందసంపచ్ఛయమ్ము
అద్వితీయమ్మేక మపరిణామ ప్రాప్త
మపరిమేయమ్మది యచ్చ తెలివి
అట్టి జ్ఞానముతోడ నైకకాలికముగా
నాదిమునుల్ గల రా ప్రభువులు
యోగనిద్రాముద్ర నూని తామే యద్దై,
యదియ తామైయుందు రమృత కళలు
ఆత్మతో నాది ముని లెట్టు లవనితోడ
నాది నృపులైక కాలికులై చరింత్రు!

....................

అతివ నోభుగ్న్యహంకృతు లౌపవిమదు
లాత్త గండూషితత్రయు లౌర్వవహ్ని

గర్భితాంత స్తపస్కులు ఘనులు ఋషుల
కెవ్వడు విరోధి తద్వ్యధకెత్తిన యది!

(నిష్క్రమణం)

[వెనక పైనున్న తెర నెమ్మదిగా లేస్తుంది. ఎత్తైన ఒక తక్తుమీద కూర్చుని ముందు మేజా వుంచుకుని నవ్య సాహిత్య పీఠాధిపతి శ్రీ స్వామీ శివశంకరశాస్త్రి ధారా వాహికంగా కవనం వ్రాస్తూ వుంటారు. చదువుతూ వ్రాస్తారు.

ఆయనకు ఎదురుగా మరో మేజాముందు గిరజాల జుట్టున్న ఒక బారులాల్చీ యువకుడు కూర్చుని రూళ్ళకర్రా పెనసలు తీసుకుని, రూళ్లుగీస్తూ వుంటాడు. స్వామీజీ, అవతల 'ఓకాంతా!' అన్నప్పుడల్లా – కుర్రాడు సర్న ఒక రూలు గీస్తాడు.]

స్వామీజీ :

ఆ ప్రభాతము వేళ ఓకాంతా!
అభిజనుల సౌధాన ఓకాంతా!
కుట్టిమము వేదిపై ఓకాంతా!
కూర్చుంటి వదినెతో ఓకాంతా!
ఆ యింటి భామినుల కో కాంతా!
అప్పురాలట వదినె ఓకాంతా!
కుశలమడిగిన పిదప ఓకాంతా!
గోష్ఠి చేసిరి వారు ఓకాంతా!
నే పరధ్యానముగ ఓకాంతా!
నింగికాంచుచు నుంటి ఓకాంతా!

చూచుచుండగ నటుల ఓకాంతా!
సూర్యకాంతులు పడిన వోకాంత్రా!
మస్తకమ్మును ద్రిప్పి ఓకాంతా!
మరల కన్నులువిప్ప ఓకాంతా!
ఆవిర్భవించినది ఓకాంతా!
అభినవా కారమ్ము ఓకాంతా!
..............................
అట్టాలకమునుండి ఓకాంతా!
ఆ పురుషవిగ్రహము ఓకాంతా!
వాల్చి నిజశీర్షమ్ము ఓకాంతా!
వంపు సోపానములు ఓకాంతా!
దిగుచుండు సనుయాన ఓకాంతా!
తిలకించినా నమ్ము ఓకాంతా!
చివర సోపానమ్ము ఓకాంతా!
చేరినంతనె నన్ను ఓకాంతా!
విప్పుకన్నులతోడ ఓకాంతా!
వీక్షించె నా మూర్తి ఓకాంతా!

[స్వామీజీ వ్రాయడం మానేస్తారు—కుర్రాడుకూడా రూళ్ళేయ్యడం మానేస్తాడు. స్వామీజీ లేచి నిల్చుని చేతులు దులుపుకుంటారు—కుర్రాడు కూడా లేచి నిల్చుని చేతులు దులుపుకుంటాడు.]

స్వామీజీ: ఈ పూట చాలా పనిచేశాను.
కుర్రాడు: నేనూ చాలా పని లాగేశాను.

స్వామిజీ : వరహాల్లాంటి కవనం వాహినిగా నాలుగు వేల పంక్తులు రచించాను.

కుర్రాడు : వజ్రాల్లాంటి రాళ్లు వరసగా నాలుగు వేలు గీసేశాను.

స్వామీజీ : (భగ్గునమండి) చట్ ! ఏమన్నావ్ ?

కుర్రాడు : (అమాయికంగా) నే నే మ న్నా న ం డీ, రాళ్లన్నాను! (హఠాత్తుగా తెర దిగిపోతుంది.)

# తృ తీ యాం క ము

[గిరీశం ప్రవేశం]

గిరీశం : ఇప్పుడు మనం విశ్వాన్నుంచి విలయానికి ఎగురుతున్నాం. ఈ దృశ్యాలను చూసి భరించాలంటే మనస్సు మీద బుద్ధి కంట్రోలు సొంతం లాకు లెత్తెయ్యాలి. ప్రేక్షక మహాశయులకు హెచ్చరిక ! (నిష్క్రమణ)

[ఆరుద్ర ప్రవేశం]

ఆరుద్ర :

ఇది విష్కంభం
ఆదిమానవుడిలో స్రవించిన భయం
ప్రవహిస్తున్నాది నీలో
అతడి మస్తిష్కంలో, హస్తంలో, అరుపులో

ప్రభవించిన తమం
భ్రమపెడుతున్నాది నిన్ను
ఏది నిజంగా కనబడుతూందో
దాన్ని గ్రహించలేవు
ఆకార రహితాలను చూడలేవు
'నిన్ను'ని గుర్తించలేవు, నిన్నే పోల్చుకోలేవు
నీ కనుపాప అయిదేళ్ల చిట్టిపాప
ఉద్దేశించిన భావాల ఆడబొమ్మలకి
వాక్యాలు గడ్డాలూ మీసాలూ పెడతాయి
తుపాకులు బహిరంగంగా
మనుషులను వెక్కిరిస్తాయి
విశాల లోకం సర్కసు లోపల
నియంతలనోట్లో ప్రజాజీవితం తెగుతుంది
సైన్సు గడ్డు సమస్యలను పుంఖాను పుంఖంగా
తయారుచేస్తుంది
గణితం మానవుని అవసరాలబడి ఎగేస్తుంది
విద్య జీతం నష్టం మీద
అనారోగ్య కారణాలవల్ల సెలవు పెడుతుంది
ప్లీడరు గుమాస్తాకి లంచం రెట్టింపవుతుంది
కిరణాల కోట్లో ధరలు
రెచ్చి తమ్ముకు హెచ్చువేసుకొంటాయి
చిరంజీవి మానవుడా!
ఇది ప్రళయం

ఆదిమూర్తి లిబిడోలో
గడ్డ కట్టిన కామం కరుగుతున్నాది నీలో
ఆతడి కనులలో కౌగిలిలో పొలికేకలలో
తిష్ట వేసిన ఆకలి ఆశ్చర్యపెడుతున్నాది నిన్ను
ఏది నిజంగా జరుగుతున్నదో దాన్ని చూడలేవు
ఆధార రహితాలను పేర్చలేవు,
'నేటి'ని మార్చలేవు నిన్నే పోల్చుకోలేవు
నీ అవ్యక్తం, అల తొలిప్రొద్దుల దండకారణ్యం.
(నిష్క్రమణం)

['శ్రీశ్రీ మార్కు పద్యాలనే వ్రాసుడు!' అని వ్రాసి వున్న అట్టలు వెన్నునా ఎదురొమ్మునా, వ్రేలాడగట్టుకొ[ని] చెదరి చీకాకైన జుట్టుతో శ్రీ శ్రీ ప్రవేశం.]

శ్రీశ్రీ :

రెండు ఖడ్గాలు
రెండు ఖంజరీటాలు
రెండు అగ్నిపర్వతాలు
రెండు ఆంజనేయ దండకాలు
జో జో
జే జే
రెండు కంకాళ కార్తిక దీపాలు
రెండు రాబందు రా(జా)జీ నామాలు
రెండు కళ్లు తెరచిన నాగళ్లు

రెండు పిడికిళ్లు బిగించిన కొడవళ్లు
హో హో
హూ హూ

రెండు కళ్లు
రెండు కళ్ల జోళ్లు
రెండు కళ్ళజోళ్ళ నోళ్లు
రెండు కళ్ళజోళ్ళ నోళ్ళ వాగుళ్లు
హీ హీ
రీ రీ

రెండు ఒలిగ్రామ్య భాషలు
రెండు సమస్తాంధ్ర ఘోషలు
రెండు నిండు కొబ్బరికాయలు
రెండు నారింజకాయలు
బా బా
బీ బీ

రెండు చదువురాని విస్తరాకులు
రెండు దారితప్పిపోయిన కిరీటాలు
రెండు చీకటింట్లో రాకాసి కేకలు
రెండు నిలబడ్డ నిట్టూర్పు కొరడాలు
దా దా
దీ దీ

రెండు వేషాలు విప్పేసిన తలగడ్డాల క్రింద
నిద్రమేలుకుంటున్న నఖక్షతాలు
రెండు నిశ్శబ్దాలు విరిసిన స-గమపదనిశలమీద
నీడలు పలికించిన విలోల కల్లోలాలు
రెండు యుగాంతాల సందున దిగంతాలమాటున
వసంతాలాడుకునే అనంతాలు
నే నే
నీ నీ

రెండు జగన్నాథ రథరథ రథాథర ధరాధర
రసాతల జలపాతాలు
రెండు స్వాయం శమం వరం తకం ప్రకంపమాన
లోకా లోక విలోకాలు

రెండు భ్రమా భ్రమర భ్రమణ భ్రమరణ
భ్రమావరణ బ్రహ్మ వైవస్వత
మన్వంతరాలు
శ్రీశ్రీమార్కు పద్యాలనే వాడుడు! (నిష్క్రమణ)

[తెర లేస్తుంది — చీకటి చీకటిగావున్న పెద్ద స్మశానం — కాష్ఠాలు ఎర్రగా జ్వాలలురేగి మండుతూ వుంటాయి. గురజాడ అప్పారావుగారు, గిడుగు రామమూర్తి పంతులూ చెరో వైపునా రెండు చెట్లకు తల క్రిందులై వ్రేలాడుతూ వుంటారు. అనేకమంది గుర్తు తెలియని మనుష్యులు, జీబుతలలతో పిశా

చాలులా ఇటూ అటూ తిరుగుతూ వుంటారు. గుడ్లగూబలు అరుస్తూ ఇటు అటూ ఎగురుతూ వుంటాయి.]

[ఆకాశంలో ఒక ధ్వని]

*ఓహో సౌందర్య సామ్రాజ్య నిశీథమూర్తీ
తరాలనుంచి వ్యాపించవచ్చు
విచార వ్యాధిగ్రస్తుడౌ
సామ్రాజ్యాధిపుని బోలుదును నేను;
తరాల విచారము నా హృదయాన
ప్రవేశించి వ్యాపించి
సమాధిచేసె నా పుష్పాలశయ్యను!
నిర్జీవకార్యాలుగానుండు
మృతజీవిగా నే జేయునవి!
ఏమందువా ఓ నిశీథ సౌందర్యమూర్తీ!
నా రక్తనాళాలలో పసరెక్కి—
పేరుకొన్నది విపరీతమై తరణి.

[చిరిగిపోయిన చొక్కా—లాగూ, చెదిరిపోయిన జుట్టూ శ్రీశ్రీ ప్రవేశించుతాడు. అటునుంచి అదే భీభత్సాకారంలో పురిపండా అప్పలస్వామి ప్రవేశించి, యుద్ధహూరంగం మధ్యను తారసిల్లుతారు. శ్రీ శ్రీ, పురిపండా ముఖంలోకి తీక్ష్ణంగా చూసి వికటాట్టహాసంగా నవ్వి :]

---

* శ్రీ॥ శ్రీ॥ కవిట్టా రచన.

శ్రీ శ్రీ : హా ! హా ! హా ! విన్నావ్
తురాయికంటె, ! ఆ
కురాయికంటె
కీచురాయికంటె
హిమాంసురాయి గొప్పవాడు
ఏం బ్రదర్ !

........................

హాంగ్ కాంగ్ లో
కింగ్ కాంగ్ తో, ఒ
రాంగుటాంగ్ ఆడిన
పింగ్ పాంగ్ లాగు !!!—

పురిపండా : హా ! హా ! హా ! అవును బ్రదర్.

లోకం కాలం నాపై
రాబందు దంపతులై
నా శవాన్ని
బతికుండిన నా శవాన్ని
చీల్చి నంచుకుతింటుంటే
పంచుకు భక్షిస్తుంటే
నీ గుండెల వికసించిన
గులాబీల తెలివసనం
నా వొడలి నలంకరించి
నా కెంపుల స్వప్నం

నా పథ వీధిని వెలిగిస్తే
శతసహస్రవధువులు రా
కన్నెలు నావెంటవచ్చి
వెడలినాను వినువీధికి!

(శ్రీశ్రీని ముద్దుపెట్టుకుంటాడు)

శ్రీ శ్రీ: (చిరాకెత్తి జుట్టు పీక్కుని తందనా లేస్తూ:)

రాబందుల రెక్కల చప్పుడు
పొగగొట్టపు భూంకారధ్వని
అరణ్యమున హరీంద్రగర్జన
పయోధర ప్రచండ ఘోషం
ఖడ్గమృగోదగ్ర విరావం
ఝంఝానిల షడ్జధ్వానం
కావాలోయ్ నవకవనానికి
కావాలోయ్ నవకవనానికి

(అప్పలస్వామి బుగ్గమీద పొడుస్తాడు.)

(ఇద్దరూ చెట్టాపట్టాల్ పట్టుకుని వెర్రిగా నవ్వుకుంటూ మండుతూన్న కాష్ఠాల వేపు బయలుదేరతారు. మరొక యువకుడు ఎదురై.)

విన్నారా! అన్నాయ్!
ఈ సన్నాయ్!—
రెండూ రెండూ నాలుగు
అన్నది నిజం!

నిజంగా నిజం!

ముగ్గురూ నవ్వుస్తావుంటారు.

[బెల్లప్పకొండ రామదాసు ప్రవేశించి పైపంచ తీసి వల్లెగా వేసుకుని ]

బె.రామ: బ్రతుకొక అశోకవృక్షం
ప్రపంచమొక లంకానగరం
నేను సీతను!
జీవితాశోకవృక్షచ్ఛాయల్లో
కూర్చున్నా—
నా చుట్టూ
బాధిస్తూ దానవులు–మానవులు
నేను సీతను
జీవితాశోకవృక్షచ్ఛాయల్లో
హనుమంతునిరాక ఎదురుచూస్తూ
లంకాదహనం ఎదురు చూస్తూ!

బుగ్గను వే లేసుకుని చెట్టుక్రిందపోయి కూర్చుంటాడు.

పోతూపోతూ వున్న శ్రీశ్రీ పురిపండా చివాల్న వెనక్కు తిరిగి ఆవేశంగా నడిచి వస్తూ :

పురిపండా :

బురుజుమీది బొల్లిగద్ద
బురుజుక్రింద కృకలాసం
ఉల్లిపాము తలపాగా

ఊరినిండ పులిపంజా
చీకటిచిందిన రక్తం
క్ష్వజ్ఞాంగుల విష్కంభం
పాడలేని పాడుకోట
పణ్యాంగన పరిహాసం!
రణారణారణా
ఝణాఝణాఝణా
కనకదుర్గ కాలి అందె
కపాలపాత్రిక నిండా
అపారమీ పానీయం
పగిలిపగిలి రగిలిరగిలి
ఇది విప్లవసంకేతం
చిరవాంఛిత సంక్షోభం!
ఓహో సైనికులారా
మీ హాయ హేషల బెదరిన
అరదమ్ములు నీరదాలు
గజ గజ గజ
వృద్ధ వసుంధర స్వాహా
నా గేయం మీ కవచం
మీ ఖడ్గం నా గేయం
కుబుసం వదలిన సర్పం
నా గీతం పులిపంజా

[శ్రీ శ్రీ అందుకుని—తాండవం. అందరూ అతనితో పాటు కోలాహలంగా భీభత్సతాండవం. జట్టా పట్టాల్ పట్టుకుని వలయంగా తిరుగుతూ వుంటారు...నేపథ్యంలో—'అతిమనో బుద్ధ్యహంకృతు లాపనిమదులు' అన్న పద్యం వినిపించుతుంది.]

(అంతా కలిసి బృందగానం)

వస్తున్నది కాలభుజంగం
వైశ్వనాథ సాత్య నారాయణీయం
వెయ్యిపడగ లేసు లేసుకుని
కయ్యానికి వచ్చేస్తున్నది!
రా రమ్మని ఆహ్వానిద్దాం,
రాకుంటే రజ్జే లేదోయ్!
రక్తిగట్ట దీ భీభత్సం.

['అతి మనోబుద్ధ్యహం కృతులు' అన్న పద్యం చదువుతూ సత్యనారాయణగారు రంగం మధ్యకు వస్తారు. తక్కిన వాళ్ళంతా ఆయన్ను వలయంగా చుట్టేసి భీభత్సంగా అరుస్తూ వుంటారు. వలయానికి మధ్యన సత్యనారాయణగారు పార్కర్ పెన్ బాకుతో కోడితాచులా నాట్యం చేస్తూ యెవరందితే వారిని కాటెయ్యడానికి ప్రయత్నించుతూ వుంటారు. (తెర)

ప్రేక్షకులలోనుంచి పూషా (రజనీకాంతరావుగారు) లేచివచ్చి రంగంమీాది కెక్కి :

పూషా :

మనిషికి లా ఆఫ్ మదర్ కంట్రీ!
జీవితానికి ఆర్ట్ అండ్ పొయిట్రీ!

అక్కర్లేదు అన్ నెసిసరి!
యూనివర్స్ కింక పెడాంట్రీ
అక్కరల్లేదు అన్ నెసిసరి!

(ఇతి భరతవాక్యం)

---

# మ హా ద య ం

లెంపోయి! లెంపోయి! బ్రతికి లేవంపోయి!
విగతప్రాణుల్లార! మృతశరీరములార!... లెం.
తెలిమించువాకల్లు,
మన ప్రాణరేఖల్లు,
వీకమైన గగనాన
దూకివచ్చిన పవిగో!... లెం.
విశ్వశ్మశానంపు భస్మరాసుల్లార!
'గోరీ'లలోని కంకాళ శిథిలములార!... లెం.
పతిత జీవనులార! బానిస ప్రజలార!
గతిలేక పడియున్న కష్టజీవుల్లార!
మతిలేని జనులార! మృతశరీరములార!... లెం.
కటికచీకటితేని కట్లడులలో జిక్కి-
కొసరు ప్రాణాలతో కుందు ఖైదీలార!
విశ్వకారాగార వీధిలో చెరవడ్డ,
విశ్వకార్మికులార! నిగళబద్ధుల్లార!... లెం.

# మాతృగీతి

తల్లిరానేవచ్చె, తడవాయె రారండు!
చల్లగా మన తెనుగుతల్లి రానేవచ్చె—
ప్రణమిల్లి జయగీతి పాడండి మృదురీతి,
ముక్కోటి తెలుగుల్లు మొలయండి జయగీతి... త.
కనుమలో నీలాలు కరిగి ఒలికెనో యేమొ,
తల్లిజడ త్రాచులా, కళ్లల్లొ మెసిలింది
కృష్ణవేణీరుచులె నిజమూ, క్రేపులా
క్రేళ్లురుకు కటిపైన సతమూ... త.
గోదావరీవారి కులుకు లవిగోరా!
తెలుగుమల్లెల పొగరు వెలుగు లవిగోరా!
హాయిగా ఊగుతూ, నీటు జూపేనూ
దేవికంఠాన కత్తెరదండయేను... త.

# కీలుగుఱ్ఱం

కీలుగుఱ్ఱముపైన,
బాలిసు కానుకొని,
ప్రాణాలులేనట్టి
భగవంతుడొచ్చాడు—
ఊరంత ఊరేగుతూ,
ఉత్సవము సారించుతూ—
కూలిమాటడగండిరా!

అన్నాలు
చాలవని చెప్పండిరా

## క్విట్ ఇండియా!

తెల్లదొరా! కల్లదొరా!
మాయదారి మల్లుదొరా!
ఇల్లువిడిచి దారిబట్టవోయ్!
తెలతెల్లవారె,
కొల్లగొట్టువేళ దాటెనోయ్!
ఓ మాయిదారీ మల్లుదొంగా!
ఇంటివారు మేలుకొన్నారోయ్!

*

పెద్దమడిసీ నంటువచ్చి,
మిద్దెలోకీ చేరుకోనీ,
గద్దెనెక్కి, కూరుచున్నావా?
తగవుల్లు రేపీ,
అన్నదమ్ముల చీలదీశావా?
తంపుల్లు బెట్టీ,
తల్లి పిల్లల కెడము చేశావా?
ఓ మాయదారీ మల్లుదొంగా!
ఇల్లువిడిచి దారిబట్టవోయ్!
కల్లమాట లెన్నొ చెప్పీ,
వల్లపూస మిగులకుండా,

ఇలువల్ల కాదు చేశావా ?
ఓ తెల్లవాడా !
చిల్లిబొచ్చె చేతికిచ్చావా?... ఓ.

## స్వర్గానికి రోడ్డు

"బ్రతుకంతా భారం, క్రూరం,
ప్రమాదాలతీరం, ఘోరం,
పుట్టటమే మహాపాతకం,
చావే యిక మేల" ను కుంటూ,
నిరుత్సాహ పడకంఠోయ్ !
నిస్పృహగా వాపోకంఠోయ్!!
నరచరిత్ర చూసుకు నడవని
నిరుత్సాహ నీరసులారా !
యుగయుగాల కాలంనుంచీ,
మానవ్వ మేం జేస్తోందోయ్?_

## నీ కవి

నీ కవిని బ్రతికించుకోవాలిరా !
నీవు మనిమనిపించుకోవాలిరా !
బ్రతికియున్నన్నాళ్లు పట్టె డన్నము నిడవు,
అతడు చచ్చినవెనుక అందలాలంటావు... నీ కవిని.
కూడుగుడ్డా నీకు కావాలెనన్నాడు
తనమాట మరచి నీ కొరకె వాపోయాడు... నీ కవిని.
రచ్చలో నీ మాట తెచ్చి వాదించాడు,

విచ్ఛకలమూని, నీ శత్రువుల చీల్చాడు... నీ కవిని.
చండమార్తాండుడై ముందడుగు వేశాడు,
'అండ నేనున్నాను రండిరా!' యన్నాడు... నీ కవిని.
రణదుందుభిని ముందు చరచాడురా,
తొలిబాంబు విసరింది వాడేనురా,
కలియబడ్డది మొదట వాడేనురా,
తొలికత్తి దూసింది వాడేనురా... నీ కవిని.

# ప్రపంచ విప్లవం

ఓ......
ఓ...ఒ...ఒ...ఓ...
ఓ...హాహా...హో...
ఓహాహాహో...ఓహోహో...హో
ఓహోహోహో హో...
ధీరుల్లారా...! శూరుల్లారా!
యువకుల్లారా!...యోధుల్లారా!
విప్లవ జీవుల్లారా!
వీరులారా! విజయులార...ఓ...
ప్రపంచ విప్లవ శంఖారావం
వీరుల్లారా వెడలండీ!
విజయ మహోదయ ఘంటారావం
కార్మికులారా! కదలండి... ప్ర.
ప్రజా విప్లవపు భయదారావం

మానవులారా రారండీ!
బానిస జాతుల స్వతంత్ర సమరం
రాణువలన్నీ కదలండీ... ప్ర.
మానవ జాతికి ఆఖరు యుద్ధం
యోధుల్లారా! నడవండీ,
నరనారీజన విప్లవ గీతం
వీరమూర్తులై పాడండీ... ప్ర.

# మురళి

ఎదలోన మత్తులా
నిదుర ముంచేస్తోంది,
నీ మురళి మ్రోయించకోయీ!
నరజాతి
కిది నిదుర వేళ కాదోయీ!
వీరులంతా లేచి వెడలివస్తున్నారు,
కత్తుల్లుదూసేసి కదనాన దూకేరు,
ఇది మహోదయ వేళరా!—రణమునకు,
శూరులురికే జాడరా!...నీ మురళి.
కొమ్ములూరా లేమిచేశారురా?—మీరు.
పాంచజన్యము లెచట దాచారురా?
దశదిశలు ఘూర్ణిల్లి దద్దరిలిపోవాలి,
శంఖారవము చేయరా!—విలయగతి,
సింహనాదము చేయరా!... నీ మురళి.